Telugu translation of the English book
"Avoid Clashes"

# ఘర్షణలకు దూరంగా ఉండండి

సంపాదకులు
డా॥ నీరూబెన్ అమీన్

# త్రిమంత్రము

(సర్వవిఘ్న నివారణ చేసే త్రిమంత్రములు)

## నమో అరిహంతాణం

తమ అంత:శత్రువులైన క్రోధ, గర్వ, లోభ, మోహములను నాశనము చేసిన వారందరికి నా నమస్కారము.

## నమో సిద్ధాణం

ఆత్యంతిక మోక్షమును పొందిన వారందరికీ నేను నమస్కరించుచున్నాను.

## నమో ఆయరియాణం

ఆత్మసాక్షాత్కారమును పొంది మోక్షమార్గమును చూపిన ఆచార్యులందరికీ నా నమస్కారము.

## నమో వజ్ఝాయాణం

ఆత్మ జ్ఞానమును పొందిన ఆధ్యాత్మిక మార్గ గురువులందరికి నా నమస్కారము.

## నమో లోయే సవ్వసాహుణం

ఆత్మ జ్ఞానమును పొంది ఆ మార్గంలో పురోగమించుచున్న ఈ విశ్వంలోని సాధువులందరికీ నేను నమస్కరించుచున్నాను.

## ఏసో పంచ నముక్కారో

ఈ ఐదు నమస్కారములు

## సవ్వ పావప్పనాశనో

సమస్త పాపములను నాశనము చేయును.

## మంగళానాం చ సవ్వేసిం

మంగళప్రదమైన వాటి అన్నింటిలో

## పఢమం హవయి మంగళం

ఇది సర్వోత్కృష్టము.

## ఓం నమో భగవతే వాసుదేవాయ

మానవుని నుంచి మాధవునిగా మారిన వారందరికి నా నమస్కారము.

## ఓం నమ: శివాయ

మానవాళి మోక్షార్థమై సాధనాలుగా మారిన విశ్వంలోని మంగళస్వరూపులందరికీ నా నమస్కారము.

జై సత్ చిత్ ఆనంద్

శాశ్వతమైన దానియొక్క ఎరుకే ఆనందము.

# జ్ఞాని పురుషుని యొక్క పరిచయం

అది 1958వ సంవత్సరం జూన్ నెలలో ఒకనాటి సాయంత్రం సుమారు ఆరు గంటల సమయం, పశ్చిమ భారత దేశంలోని దక్షిణ గుజరాత్‌లోని ఒక పట్టణమైన సూరత్ రైల్వే స్టేషను. అంబాలాల్ మూల్‌జీ భాయ్ పటేల్ నామధేయుడు, వృత్తి రీత్యా కాంట్రాక్టరూ అయిన ఒక గృహస్థుడు జనసమూహంతో రద్దీగా వున్న సూరత్ స్టేషన్‌లోని మూడవ నెంబరు ప్లాట్‌ఫాం బెంచిపైన కూర్చుని ఉన్నారు. ఆ సమయంలో నలభైఎనిమిది నిమిషములపాటు ఒక అద్భుతం జరిగింది. అకస్మాత్తుగా అంబాలాల్ మూల్‌జీభాయ్ పటేల్‌లోని ఆత్మ సాక్షాత్కారమైంది. ఆ సమయంలో అతని అహంకారం సమూలంగా దగ్ధమైపోయింది. ఆ క్షణం నుంచి అతను అంబాలాల్ యొక్క ఆలోచనలు, వాక్కు మరియు క్రియలన్నింటినుంచి పూర్తిగా వేరుచేయబడి, జ్ఞానమార్గం ద్వారా మానవాళికి ముక్తిని ప్రసాదించే నిమిత్తం భగవంతుని చేతిలో సజీవ పరికరంగా మారారు. ఆయన తనకు ప్రకటితమైన పరమాత్మని దాదాభగవాన్ అని పిలిచారు. "ఈ పరమాత్మ, దాదాభగవాన్ నాలో పూర్ణరూపంలో వ్యక్తమైనాడు; మీలో అవ్యక్తంగా ఉన్నాడు. భేదం ఇంతమాత్రమే. ఆయన జీవులందరిలోను విరాజమానుడై ఉన్నాడు.'' అని తనను కల్సిన ప్రతి ఒక్కరితోనూ చెప్పేవారు.

మనం ఎవరము? భగవంతుడంటే ఏమిటి? జగత్తును ఎవరు నడిపిస్తున్నారు? కర్మ ఏమిటి? మోక్షం ఏమిటి? ఇత్యాది సమస్త ఆధ్యాత్మిక ప్రశ్నలకు ఆ సందర్భంలో సమాధానం లభించింది. ప్రకృతి శ్రీ అంబాలాల్ మూల్‌జీ భాయ్ పటేల్ ద్వారా ప్రపంచానికి సంపూర్ణ తత్త్వరహస్యాన్ని వెల్లడిచేసింది.

శ్రీ అంబాలాల్ జన్మస్థలం బరోడాపట్టణ సమీపంలోని తారాసలి; పెరిగింది గుజరాత్‌లోని బాదరణ్ గ్రామం. ఆయన ధర్మపత్ని హీరాబా. వృత్తిరీత్యా కాంట్రాక్టరు అయినప్పటికీ ఆత్మసాక్షాత్కారం పొందటానికి ముందు కూడా అతని వ్యావహారిక జీవనం ఇంట్లోను, చుట్టు ప్రక్కలవారితోను కూడా ఎంతో ఆదర్శప్రాయంగా ఉండేది. ఆత్మ సాక్షాత్కారం పొందిన తరువాత జ్ఞానిగా ఆయన జీవితం ప్రజలకే అంకితమైంది.

వ్యాపారంలో ధర్మం ఉండాలి, ధర్మంలో వ్యాపారం ఉండకూడదు అనే నియమాన్ని ఆయన జీవితమంతా అమలుపరచారు. భక్తులచే దాదాశ్రీగా

పిలువబడే ఆయన ఎన్నడూ ఎవరినుంచీ స్వంత ఖర్చుల నిమిత్తం ధనాన్ని స్వీకరించలేదు. పైగా తనకు వ్యాపారంలో లభించిన లాభాలను, భక్తులను భారతదేశంలోని వివిధ యాత్రా స్థలాలకు తీసికొనివెళ్లటానికి వినియోగించేవారు.

దాదాజీ మాటలు అక్రమవిజ్ఞాన్‌గా పిలువబడే కొత్త, డైరెక్ట్ మరియు మెట్లదారికాని లిఫ్ట్ మార్గమైన ఆత్మానుభూతి మార్గానికి పునాది అయ్యాయి. అతడు తన దివ్య ప్రాచీన విజ్ఞాన ప్రయోగం (జ్ఞాన విధి) ద్వారా కేవలం రెండు గంటలలో ఈ జ్ఞానాన్ని ఇతరులకు అందచేశారు. వేలకొలది ముముక్షువులు ఈ విధానం ద్వారా ఆయన అనుగ్రహాన్ని పొందినారు, ఇప్పటికీ వేలకొలది ముముక్షువులు పొందుతూనే ఉన్నారు. అక్రమమార్గం అంటే మెట్లు లేనిది, లిఫ్ట్‌మార్గం లేక షార్ట్‌కట్ మార్గం. క్రమ మార్గం అనగా మెట్టుతర్వాత మెట్టు క్రమంగా ఎక్కే ఆధ్యాత్మిక మార్గం. ఇపుడు అక్రమమార్గం ఆత్మానుభూతి నిమిత్తం డైరెక్ట్, షార్ట్‌కట్ మార్గంగా గుర్తింపబడింది.

## దాదా భగవాన్ ఎవరు?

దాదా భగవాన్ ఎవరు? అనే విషయాన్ని వివరిస్తూ ఆయన ఇలా అన్నారు :

"మీకు కన్పించేది 'దాదాభగవాన్' కాదు. మీరు చూస్తున్నది ఎ.ఎమ్. పటేల్‌ని. జ్ఞానిపురుషుడనైనా నాలోపల పూర్ణరూపంలో వ్యక్తమైన భగవంతుడు 'దాదాభగవాన్'. ఆయన చతుర్దశ భువనాలకు ప్రభువు. ఆ దాదాభగవాన్ మీలోను, ప్రతి ఒక్కరిలోను కూడా ఉన్నారు. మీలో అవ్యక్తరూపంలో ఉంటే, ఇక్కడ (ఎ.ఎమ్. పటేల్ దేహంలో) సంపూర్ణంగా అభివ్యక్తమైనాడు. నేను దాదా భగవాన్ కాదు. నాలోపలి దాదాభగవాన్‌కి నేను కూడా నమస్కరిస్తాను.

## జ్ఞాన (ఆత్మజ్ఞాన) ప్రాప్తికై వర్తమానలింక్

"నేను స్వయంగా సిద్ధులను (ప్రత్యేక ఆధ్యాత్మిక శక్తులను) కొద్దిమందికి ప్రసాదించబోతున్నాను. నేను వెళ్లిపోయిన తర్వాత వాటి అవసరం ఉండదా ? భవిష్యతరాల ప్రజలకు ఈ మార్గం యొక్క అవసరం ఉంటుంది, అవునా?"

- దాదాశ్రీ

పరమపూజ్య దాదాశ్రీ గ్రామ గ్రామమూ, దేశవిదేశాలు పర్యటించి ముముక్షువులకు సత్సంగంతోపాటు ఆత్మజ్ఞాన ప్రాప్తిని కలిగించారు. దానితోపాటు

సంఘీభావంతో కూడిన ప్రాపంచిక వ్యవహార జ్ఞానాన్ని కూడా తనను కల్సిన వారందరికీ అందించారు. ఆయన తన అవసానదశలో, 1987 చివర్లో తన కార్యాన్ని కొనసాగించే నిమిత్తం డాక్టరు నీరుబెన్ అమీన్‌కి సిద్ధులను అనుగ్రహించారు.

పరమపూజ్య దాదాశ్రీ జనవరి 2, 1988న దేహత్యాగం చేసిన తర్వాత డా॥ నీరుబెన్ భారతదేశ గ్రామాలలోనూ, పట్టణాలలోనూ, ప్రపంచంలోని అన్ని ఇతర దేశాలలోనూ పర్యటిస్తూ దాదాశ్రీ కార్యాన్ని కొనసాగించారు. మార్చి 19, 2006న దేహత్యాగం చేసేవరకు ఆమె అక్రమవిజ్ఞాన్‌కి దాదాశ్రీ ప్రతినిధిగా వున్నారు. దేహ త్యాగానికిముందు ఆమె ఆ కార్యభారాన్ని శ్రీ దీపక్ భాయ్ దేశాయ్‌కి అప్పగించారు. ఆధునిక కాలంలో ఆత్మానుభూతికి సరళమూ మరియు డైరెక్ట్ మార్గంద్వారా అక్రమ విజ్ఞానాన్ని వ్యాపింపచేయటంలో డా. నీరుబెన్ సాధనం అయి ప్రముఖ పాత్రను పోషించారు. లక్షల కొలది ముముక్షువులు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొన్నారు. వారు తమ సంసార బాధ్యతలు నిర్వర్తిస్తూ కూడాస్వేచ్ఛను, శాంతిని, ఆత్మరమణత యొక్క అనుభూతిని పొందుతున్నారు.

అక్రమ విజ్ఞాన సత్సంగం నిర్వహించే నిమిత్తం జ్ఞాని పురుష్ దాదాశ్రీ పూజ్య నీరుబెన్ అమీన్ సమక్షంలో శ్రీ దీపక్‌భాయ్ దేశాయ్‌కి సిద్ధిని ప్రదానం చేశారు. 1988-2006 మధ్యకాలంలో దాదాశ్రీ దిశానిర్దేశానుసారం, డా. నీరుబెన్ అమీన్ నాయకత్వంలో దేశవిదేశాలలో శ్రీ దీపక్ భాయ్ సత్సంగ్ నిర్వహించారు. ఈ అక్రమ విజ్ఞాన్ యొక్క జ్ఞానవిధులు, సత్సంగ్‌లు ఇపుడు పూర్తిస్థాయిలో ఆత్మజ్ఞాని శ్రీ దీపక్ భాయ్ దేశాయ్ మాధ్యమం ద్వారా కొనసాగుతున్నాయి.

శాస్త్రాలలోని శక్తివంతమైన పదాలు మోక్షకాంక్షను వృద్ధి చేయటంలో సహకరిస్తూ ఆ మార్గానికి ప్రాతినిధ్యం వహిస్తాయి. ముముక్షువులందరికీ ఆత్మజ్ఞానమే అంతిమ లక్ష్యం. స్వరూప జ్ఞానం లేకుంటే మోక్షం లేదు. ఈ జ్ఞానం పుస్తకాలలో లభించదు. అది జ్ఞాని హృదయంలో వుంటుంది. కనుక ఆత్మజ్ఞానాన్ని ప్రత్యక్షజ్ఞాని నుంచి మాత్రమే పొందగలం. అక్రమ విజ్ఞాన్ యొక్క విజ్ఞాన ప్రయోగం ద్వారా ప్రత్యక్ష జ్ఞానినుంచి నేడుకూడ ప్రతి ఒక్కరూ ఆత్మజ్ఞానాన్ని పొందవచ్చు. ఒక జ్యోతి మాత్రమే మరొక దీపాన్ని వెలిగించగలదు.

❖❖❖❖❖

# అనువాదకుని విజ్ఞప్తి

అంబాలాల్ ఎమ్. పటేల్ నామధేయులైన జ్ఞానిపురుషుని దాదాశ్రీ లేక దాదా లేక దాదాజీ గా భక్తులందరూ పిలుస్తారు. ఆత్మ విజ్ఞాన సంబంధమైన మరియు ప్రపంచ వ్యవహార జ్ఞాన సంబంధమైన తన సత్సంగాన్ని యధాతధంగా అనువదించటం సాధ్యం కాదని ఆయన తరచూ చెప్పేవారు. అనువాద క్రమంలో లోతైన, సహేతుకమైన అర్ధం ముముక్షువులకు అందకపోవచ్చు అనికూడా దాదాశ్రీ చెప్పేవారు. గుజరాతీ భాషని నేర్చుకోవటంలోని ప్రాముఖ్యతను ఆయన నొక్కి వక్కాణించేవారు. తద్వారానే దాదాశ్రీ అమూల్యమైన బోధల సంపూర్ణసారాన్ని యధాతధంగా గ్రహించే అవకాశం ఉంటుందని దాదా మాటల సారాంశం.

అయినప్పటికీ దాదాశ్రీ తన బోధలను ఇంగ్లీషు మరియు ఇతర భాషలలోకి అనువదించటానికి, తద్వారా ప్రపంచంలోని యావత్తు ప్రజానీకానికి అందించటానికి తమ ఆశీర్వాదాన్ని అనుగ్రహించారు. తనలో ప్రకటితమైన ఈ అక్రమ విజ్ఞానాన్ని ప్రపంచంలోని మానవాళి పొంది తమ బాధలనుంచి విముక్తి పొందాలని, జీవన్ముక్తిని అనుభవించాలని దాదాజీ యొక్క ప్రగాఢమైన వాంఛ. ఈ విజ్ఞానం యొక్క అద్భుతమైన శక్తులను ప్రపంచం గుర్తించి ప్రణమిల్లే రోజు వస్తుందని కూడా దాదాజీ చెప్పారు.

జ్ఞానిపురుషులైన దాదాశ్రీ బోధలను తెలుగుభాష ద్వారా తెలుగు ప్రజలకు అందించటం కోసం చేసిన చిన్న ప్రయత్న ఫలమే ఈ పుస్తకం యొక్క అనువాదం. యధాతధంగా అందించలేకపోయినా సత్సంగ సందేశాన్ని, భావాన్ని ఎటువంటి చెఱుపు లేకుండా అందించడంకోసం ఎంతో శ్రద్ధ వహించటం జరిగింది.

అనంతమైన దాదాజీ జ్ఞాన ఖజానాకి ఇది ప్రాధమిక పరిచయం మాత్రమే. ఈ అనువాదంలో ఏమైన తప్పులు దొర్లివుంటే అవి పూర్తిగా అనువాదకులవే అని గమనించగలరు. వాటినిమిత్తమై మేము మీ క్షమను అర్ధిస్తున్నాము.

❖❖❖❖❖

# సంపాదకీయం

"ఎవాయిడ్ క్లాషెస్" (ఘర్షణకు దూరంగా ఉండండి) ఈ ఒక్క సూత్రాన్ని జీవితంలో అమలు పర్చుకోగల్గితే జీవితం చాలా సుందరంగా ఉంటుంది. మోక్షం మన దగ్గరకి నడిచి వస్తుంది.  ఇందులో సందేహం లేదు.

అక్రమ విజ్ఞాని (షార్ట్‌కట్ మార్గము ద్వారా ఆత్మానుభవం కలిగించే జ్ఞాని) పూజ్యశ్రీ దాదాజీ ద్వారా ప్రసాదించబడిన ఈ సూత్రాన్ని అన్వయించుకొని ఎంతోమంది సంసార సాగరాన్ని దాటగలిగారు. వారి జీవితం సుఖశాంతిమయం అవ్వటమే కాక, వారు మోక్షానికి బాటకూడ వేసికొన్నారు. అందుకై మనం చేయవలసింది ఒక్కటే. "నేను ఎవరితోనూ వివాదానికి దిగకూడదు. ఎదుటివ్యక్తి ఘర్షణకు దిగటానికి లక్ష ప్రయత్నాలు చేసినా సరే ఎట్టి పరిస్థితిలోనూ నేను ఆ ప్రయత్నాలకు లొంగకూడదు" అని దృఢ నిశ్చయం చేసికోవాలి. ఆ విధంగా నిశ్చయించుకొంటే చాలు వివాదాలకు దూరంగా ఉండటానికి తగిన జాగృతి లభిస్తుంది.

రాత్రిపూట చీకట్లో బయటకు వెళ్ళవలసి వచ్చి మనం గోడకు గుద్దుకుంటే ఏమిచేస్తాం? "నాదారిలో నువ్వు ఎందుకు వచ్చావు? నా దారికి అడ్డుతొలగు. ఇది నా యిల్లు" అని అరచి గోడను కొడతామా? లేదు కదా! దానికి బదులుగా ఎంతో తెలివిగా చీకట్లో చేతులతో తడుముకుంటూ ద్వారాన్ని చేరతాం. ఎందుకు? మనకు తెలుసు నిర్లక్ష్యంగా వెళితే తలబొప్పికడ్తుంది అని.

ఒక సన్నని ఇరుకు మార్గంలో రాజు వెళ్తుండగా ఒక ఎద్దు ఎదురుగా పరుగెత్తుకుంటూ వచ్చింది. రాజు తప్పుకొని దానికి దారి యివ్వవలసే వస్తుంది. "నేను ఈ ప్రాంతానికి రాజును. నా దారికి అడ్డుతొలగు" అని రాజు ఎద్దుతో చెప్పటం వలన ప్రయోజనం ఉంటుందా? అటువంటి పరిస్థితి ఎదురైనపుడు మహారాజైనా, చక్రవర్తి అయినా సరే తాను తొలగి పరుగెత్తుకొని వస్తున్న ఎద్దుకు దారి యివ్వక తప్పదు. ఎందుకు? గాయాలనుంచి, దెబ్బల నుంచి తప్పించుకోవటం కోసం.

ఈ చిన్న ఉదాహరణల నుంచి గ్రహించవలసినది ఏమంటే మనతో ఎవరైనా ఘర్షణకు తలపడితే వారు గోడతోనో లేక ఎద్దుతోనో సమానం. అందువల్ల మనల్ని మనం కాపాడుకోవాలనుకొంటే, ఎవరితోనూ ఘర్షణ పడకుండా అటువంటి వారి మార్గం నుండి తప్పుకోవాలి. జీవితంలో సర్వకాల సర్వావస్థలలోనూ సంఘర్షణలకు దూరంగా ఉండాలి. ఎక్కడైనా సంఘర్షణ వస్తే, దాని నుండి వైదొలగండి. అలా చేయటం వలన జీవితం క్లేశరహితమౌతుంది. మరియు మోక్షం ప్రాప్తిస్తుంది.

డా॥ నీరూబెన్ అమీన్

# ఘర్షణలకు దూరంగా ఉండండి

**ఘర్షణలను మానండి (ఎవాయిడ్ క్లాషెస్)**

**"ఎవరితోనూ వివాదానికి దిగవద్దు. దానికి దూరంగా ఉండండి"**

నా ఈ సూత్రాన్ని అమలుపరిస్తే మీరు మోక్షాన్ని పొందగలరు. మీ భక్తి, నా వాక్కు యొక్క శక్తి కలసి దానిని సాధిస్తాయి. దానికై మీ సన్నద్ధత అవసరం. నా ఈ ఒక్క వాక్యాన్ని ఖచ్చితంగా పాలిస్తే వారికి తప్పక మోక్షం లభిస్తుంది. ఈ ఒక్క మాటను యధాతథంగా అమలుపరచి నట్లయితే మోక్షం కరతలామలకం అయినట్లే.

నేను చెప్పిన ఈ ఒక్క సూత్రాన్ని శ్రద్ధతో పాలించినా అద్భుతమైన అంతరంగిక శక్తి వృద్ధిపొందుతుంది. ఎంతటి క్లిష్ట పరిస్థితుల్లోనైనా ఘర్షణకు/వివాదానికి తలపడకుండా ఉండగల అనంతమైన శక్తి మీలో వుంది. స్వచ్ఛందంగా ఆత్మవినాశన మార్గాన్ని ఎన్నుకొన్నవారితో తలపడటం దేనికి? అటుంటి వ్యక్తి ఎన్నటికీ ముక్తిని పొందలేడు సరికదా మీ ముక్తిని కూడ అడ్డుకుంటాడు. మీరు మోక్షానికి వెళ్లదలచుకొంటే అటువంటి వారి సాంగత్యం కూడ పనికిరాదు. చాలా జాగ్రత్తగా మెలగాలి. ఎటువంటి ఘర్షణకు తావు యివ్వకుండా తెలివిగా సున్నితంగా బయటపడాలి. ఎంతో మెలకువగా వ్యవహరించాలి. మోక్షమనే గమ్యాన్ని చేరటానికి మీరు ఎక్కవలసిన బండి ప్లాట్‌ఫారం మీద బయలుదేరటానికి సిద్ధంగా ఉంది. మీరు హడావిడిగా వస్తుండగా మీ ధోవతి ముళ్ళతీగకు చిక్కుకుంది. అటువంటి పరిస్థితిలో ధోవతిని ముళ్ళతీగనుంచి తప్పించటానికి ప్రయత్నిస్తూ కూర్చుంటారా? క్షణకాలం కూడ వృధా చేయకుండా ధోవతిని వదిలేసి పరుగెత్తివెళ్ళి బండి ఎక్కాలి. బండిని మిస్ కాకుండా ఉండటం ముఖ్యం కదా! ఒక క్షణకాలం

కూడ ప్రపంచ విషయాలలో చిక్కుపడటం వివేకం కాదు. ప్రపంచంలోని ఘర్షణలలో చిక్కుకొన్న ప్రతిసారీ మన స్వరూపాన్ని మరచిపోతాం.

అనుకోని విధంగా ఏదైనా వివాదంలో చిక్కుకుంటే ఆ పరిస్థితినుంచి ఎటువంటి ఘర్షణకూ లోను కాకుండా బయటపడగలగాలి. సున్నితంగా సమాధాన పరచాలి.

## ట్రాఫిక్ నిబంధనల వల్ల యాక్సిడెంట్ నుంచి రక్షణ

రహదారిలో మనం నడుస్తున్నపుడు, రద్దీగా ఉన్న రోడ్డును దాటుతున్నపుడు యాక్సిడెంట్ జరగకుండా ఎంతో జాగ్రత్తగా వ్యవహరిస్తాం. నిత్య జీవితంలో కూడ ఇతరులతో వ్యవహరించేటప్పుడు ఎటువంటి ఘర్షణ జరగకుండా అంతే జాగ్రత్తను పాటించాలి. అవతలి వ్యక్తి ఎంతటి క్రూరుడైనా, అతని ప్రవర్తన ఎంత ఏహ్యమైనది అయినప్పటికి అతనిని గాయపరచటం నీ లక్ష్యం కాకూడదు. మీరు ఎంతో జాగ్రత్తగా వ్యవహరించినప్పటికీ అవతలి వ్యక్తి మీతో వివాదానికి తలపడి మిమ్మల్ని గాయపరచవచ్చు. ప్రతి వివాదంలోనూ యిరుపక్షాల వారికీ నష్టం కల్గుతుంది. మీరు ఎదుటివ్యక్తికి దు:ఖాన్ని కల్గిస్తే ఆ సమయంలో మీకూ దు:ఖం కల్గక మానదు. ఎదురుగా తలపడటం అంటే ఫలం అదే. ట్రాఫిక్ నియంత్రణకు సంబంధించిన ఉదాహరణ చెప్తాను. మీరు ఎదురుగా వస్తున్న ఏదైనా వాహనాన్ని ఢీకొడ్తే, ఆ యాక్సిడెంట్‌కి ఫలం మరణమే. అందువల్ల ఎవరితోనూ ఘర్షణకు దిగవద్దు. అదే విధంగా నిత్య జీవితంలో లౌకిక వ్యవహారంలో ఎటువంటి వివాదాలకూ తావు యివ్వకూడదు. వ్యవహారిక కార్యాలలో ఎటువంటి ఘర్షణకు దిగకూడదు. ఘర్షణలో ఎప్పుడూ రిస్క్ వుంటుంది. ఘర్షణ అప్పుడప్పుడు ఉంటుంది. నెలలో రెండు వందల సార్లు వివాదాలు, విభేదాలు తలెత్తుతాయా? నెలలో ఎన్నిసార్లు యిటువంటి పరిస్థితి నీకు ఎదురౌతుంది?

**ప్రశ్నకర్త :** ఎప్పుడో ఒకసారి! రెండునుంచి నాల్గుసార్లు.

**దాదాశ్రీ :** వీటిని అధిగమించాలి. వివాదాల కారణంగా జీవితాన్ని ఎందుకు దుర్భరం చేసికోవాలి? అది మనకు తగదు. ప్రజలు ట్రాఫిక్ నిబంధనలను, నియంత్రణలను చక్కగా గౌరవిస్తారు. వారి యిష్ట ప్రకారం వారు

డ్రైవ్ చెయ్యరు కదా? అందువల్లనే వారు ప్రమాదాల పాలు కాకుండా రక్షింపబడ్తున్నారు. అదే విధంగా నిత్య జీవితంలో కూడ వివాదాలు తలెత్తకుండా కొన్ని నిబంధనలను పాటించాలి. మీ స్వంత నిబంధనలను, ఊహాగానాలను మీరు అనుసరించటం వల్ల వివాదాలు చోటుచేసి కొంటాయి. అందరూ ట్రాఫిక్ నిబంధనలను పాటించటం వల్ల ట్రాఫిక్‌లో ఎటువంటి అంతరాయం కల్గదు. వివేకంతో అదే నియామాన్ని మీరు పాటిస్తే మీరు కష్టాలలో చిక్కుకోవటం జరగదు. ఆ నియమాలను వివరించేవారు చాలా అనుభవజ్ఞులై ఉండాలి.

ట్రాఫిక్ నిబంధనలను పాటించాలని మీరు నిశ్చయించుకోవటం వల్లనే ఆ నిబంధనలను అమలు పరచటం జరుగుతుంది. ఆ నిబంధనలను ఉ ల్లంఘించమని మీ అహంకారం మీకు ఎందుక్కు చెప్పటం లేదు. అలా చేస్తే గాయపడటమో మరణించటమో తప్పదని మీ బుద్ధి కారణంగా మీకు చక్కగా తెలుసును కనుక. అదే విధంగా ఘర్షణ పడటం వలన (వివాదానికి తలపడటం వల్ల) కూడ అటువంటి నష్టమే జరుగుతుంది. ఇది చాలా సూక్ష్మమైనది గనుక బుద్ధి దానిని గ్రహించలేదు. ప్రమాదంలో జరిగే నష్టం స్థూలం. కాని ఘర్షణ లేక వివాద కారణంగా జరిగే నష్టం సూక్ష్మం.

**ఈ సూత్రం మొట్టమొదటి సారిగా ప్రపంచానికి వెల్లడి చేయబడింది.**

1951 సం॥లో జనన మరణ చక్రంనుండి విముక్తి పొందే మార్గం చెప్పమని ఒక వ్యక్తి నన్ను అడిగాడు. అతనికి ఈ సూత్రాన్ని చెప్పాను. ' ఎవాయిడ్ క్లాషెస్ అన్న సూత్రాన్ని పాటించమని వివరించి చెప్పాను.

ఒక రోజు నేను ఆధ్యాత్మిక గ్రంథాన్ని చదువుతుండగా అతను వచ్చి “దాదాజీ! నాకు ఆధ్యాత్మిక జ్ఞానాన్ని యివ్వండి” అని అడిగాడు. అతను నా దగ్గర పనిచేస్తుండేవాడు. నేను ఇలా అన్నాను. “నేను నీకుఏమి యివ్వగలను. నువ్వు ఎపుడూ అందరితో జగడాలకు దిగుతావు. దెబ్బలాడతావు కూడ. కుస్తీపట్లు పడతావు కదా!” అతను మా వ్యాపార సంబంధమైన డబ్బుని నీళ్ళప్రాయంగా వృధా చేసేవాడు. రైళ్లలో టికెట్ లేకుండా ప్రయాణం చేయడమే కాక, ఆ అధికారులతో పోట్లాటకు దిగేవాడు. అతని గురించి అంతా నాకు తెలుసు. అతను పట్టువిడువకుండా “దాదాజీ మీరు అందరికీ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని

యిస్తున్నారు. దయచేసి నాకూ యివ్వండి" అని వేడుకొన్నాడు. అతనికి చెప్పటానికి సంశయించాను. "నేను చెప్పినా దాని వలన నీకు ఏమి ప్రయోజనం? నీవు మారవు. నీవు అందరితో జగడాలను కొనసాగిస్తూనే వుంటావు" అన్నాను.

అతను పదిరూపాయల రైలు టిక్కెట్టు కొనటం మానేసి ఇతరుల కొరకై టీ, స్నాక్స్ నిమిత్తం ఇరవై రూపాయలు వృథాచేస్తాడు. అతని వల్ల కంపెనీకి నికర నష్టం పదిరూపాయలు. అదీ అతని చరిత్ర. అతను ఎపుడు వచ్చినా నేను సాదరంగా ఆహ్వానించటంతో సంతోషపడి "దాదా! నాకేమైనా బోధించండి" అని ప్రాధేయపడేవాడు. "రోజూ ఎవరో ఒకరితో పోట్లాడి వస్తావు. అవతలి వారి ఫిర్యాదులను ప్రతిరోజు వినాలి" అని నేను చెప్పినప్పటికీ "అయినాసరే, దాదా! నాకు ఏదో ఒకటి యివ్వండి" అనేవాడు. "నేను నీకు ఒక్క సూత్రం చెప్తాను. నువ్వు దానిని పాటిస్తాను అని హామీ యిస్తేనే, ఆ షరతు మీదనే చెప్తాను" అన్నాను. అతను దానిని పాటిస్తాను అని వాగ్దానం చేసాడు. "ఎవరితోనూ వివాదానికి దిగవద్దు" అని చెప్పాను. దానిని వివరించమని అడుగగా అతనికి యిలా వివరించి చెప్పాను.

"నీవు దారిలో నడుస్తుండగా ఒక ఇనుపస్తంభం (నేలలోపాతబడినది) ఆ దారిలో ఉందనుకో. దానిని తప్పుకొని వెళతావా? లేక ముక్కు సూటిగా వెళ్ళి దానికి గుద్దుకొంటావా?" అని అడిగాను. అలా ముక్కు సూటిగా వెళ్తే నాతల పగులుతుంది అన్నాడు అతను. "ఒక ఎద్దు నీవైపు వస్తుందనుకో. దాని మార్గం నుంచి తప్పుకొని వెళతావా లేక సూటిగా వెళ్లి దానిని ఢీకొంటావా?" అని అడిగాను. "అలా చేస్తే అది నన్నుపొడుస్తుంది. అందువల్ల దానిని తప్పుకొని వెళ్తాను" అని అతని సమాధానం. "ఒక పాము దారిలోఉందనుకో. లేదా దారిలో ఒక పెద్దరాయి ఉందనుకో. అపుడు ఏం చేస్తావు?" అని అడిగాను. దానిని తప్పించి చుట్టుతిరిగి వెళ్తాను అన్నాడు. ఎందుకు అలా చుట్టుతిరిగి వెళ్లాలి? అని ప్రశ్నించాను. "నా క్షేమం కోసమే. లేకుంటే దానిని ఢీకొంటే నాకే కదా గాయాలవుతాయి" అని సమాధానం చెప్పాడు. ఈ ప్రపంచంలో కొంతమంది రాళ్ళవంటివారు, కొంతమంది ఎద్దులాంటివారు, కొంతమంది పాములాంటివారు, కొంతమంది స్తంభంలాంటివారు. మరికొంతమంది మనుష్యులే. ఎవరితోనూ ఘర్షణకు దిగవద్దు. తప్పుకొని వెళ్ళాలి. అతనికి ఈ సలహా నేను 1951లో

యిచ్చాను. అప్పటినుంచి అతను దానిని చాలా సీరియస్‌గా పాటించాడు. ఎపుడూ ఎవరితోనూ ఏ విధమైన వివాదానికి తలపడలేదు. అతనికి యజమాని, వరుసకు పినతండ్రి కూడ, అతనిలోని మార్పును గమనించాడు. కావాలని అతనిని రెచ్చగొట్టేవాడు. పినతండ్రి ఎన్నివిధాల ఎన్నికోణాలలో ప్రయత్నించినా ఫలితం లేకపోయింది. అతని మీద ఎటువంటి ప్రభావం చూపలేదు. 1951నుంచి ఏ విధమైన వివాదంలోనూ అతను చిక్కుకోలేదు.

## జీవితంలో వివాదాల నుంచి ఇదే విధంగా వైదొలగాలి.

మీరు రైలు బండి నుంచి దిగిన వెంటనే మీ సామానుదించేకూలీని పిలుస్తారు. కొంతమంది కూలీలు మీ దగ్గరకుపరుగెత్తుకొని వస్తారు. వారిలో ఒకరికి మీ సామాను తెమ్మని చెప్తారు. సామాను తెచ్చిన తర్వాత డబ్బు చెల్లించే సమయంలో అతనితో ఘర్షణకు దిగుతారు. "నేను స్టేషను మాస్టరుకి చెప్తాను. అంత డబ్బు ఎందుకు యివ్వాలి?" అని వాదిస్తారు. అటువంటి విషయాలలో గొడవ పెట్టుకోవటం అవివేకం. అతను రెండున్నర రూపాయలు అడిగితే "చూడు బ్రదర్ నిజానికి ఈ సామాను తెచ్చినందుకు రూపాయే. పోనీ రెండు రూపాయలు తీసికో" అని సున్నితంగా చెప్పి బయటపడాలి. అటువంటి సందర్భాలలో కొంచెం ఎక్కువైనా సరే యిచ్చి వివాదం రాకుండా చూచుకోవాలి. అతనితో ఘర్షణ పడితే, అతన్ని రెచ్చగొడితే అతను కత్తి దూసినా ఆశ్చర్యం లేదు. అతను పోట్లగిత్తలా లంఘించి నిన్ను గాయపరచవచ్చు.

ఎవరైనా మీ వద్దకు వచ్చి పరుషమైన, నిందాతుల్యమైన పదజాలాన్ని ఉపయోగిస్తుంటే అతను మీతో తలపడాలనే వచ్చాడని గ్రహించి జాగరూకతతో వివాదం తలెత్తకుండా చూడాలి. మీ మనస్సుమీద మొదట దాని ప్రభావం లేకపోవచ్చు. అనుకోని విధంగా మీ మనసుకి బాధకల్గితే, మనసు ఆహ్లాదాన్ని కోల్పోతే, ఎదుటివ్యక్తి యొక్క మనసు మీపై ప్రభావం చూపిస్తుందని గుర్తించాలి. దాని నుంచి తప్పించుకోవాలి. అర్థంచేసికొనే శక్తి మీకు పెరిగేకొద్దీ మీరు వివాదాలను తొలగించుకోగల్గుతారు. వివాదాలను తొలగించుకోవటం ద్వారా మాత్రమే ముక్తి సాధ్యమౌతుంది.

విభేదాలతో కూడినదే ఈ ప్రపంచం. అది స్పందన స్వరూపం. అందువల్ల ఘర్షణలను మానండి. ప్రపంచ సృష్టికి మూలకారణం విభేదాలే. దాని పరిణామం

ప్రతీకారం. ప్రతి మనిషి, ప్రతి జీవి శత్రుత్వ భావాన్ని కల్గిఉంటుంది. విభేదం యొక్క తీవ్రత ఎంత ఎక్కువగా ఉంటే ఎదుటి వ్యక్తికి మీ పట్ల ప్రతీకారేచ్ఛ అంత ఎక్కువగా ఉంటుంది. ప్రతీకారం చేయకుండా వారు మిమ్మల్ని వదలరు. అది పాము కావచ్చు, తేలుకావచ్చు, ఎద్దుకావచ్చు, గేదె కావచ్చు. మనం వాటతోవిభేదిస్తే అది తప్పక మనపట్ల వైరభావంతో ఉంటుంది. ఎందువల్లనంటే అన్నింటిలోనూ ఆత్మ వుంది. ఆ ఆత్మశక్తి అన్నింటిలో సమానంగా వుంటుంది. శారీరక దార్యం తక్కువైన కారణంగా, శారీరక బలహీనత కారణంగా అవి మన చర్యలను సహించవచ్చు కాని అంతరంగంలో వాటికి మన పట్ల వైరభావం ఏర్పడుతుంది. భవిష్యజన్మలో మనపై ప్రతీకారం తీర్చుకుంటాయి.

ఒక వ్యక్తి ఎటువంటి పదజాలంతో ఎంత ఎక్కువగా మాట్లాడినా, అవి మనల్ని విభేదానికి పురికొల్పకూడదు. ఎట్టి పరిస్థితుల్లోనూ వివాదానికి మనం తలపడకూడదు. అదే ధర్మం. ప్రజలు రోజంతా ఘర్షణ పడటమే అలవాటుగా కల్గివుంటారు. అది ఎంత చిన్నమాటైనా సరే ఆ మాట కారణంగా విభేదించకూడదన్న నియమం ఏమీ లేదు. మన మాటల కారణంగా ఎదుటివారికి ఉద్వేగాన్నికల్గించటం అన్నింటికంటె పెద్దనేరం. ఎవరైనా అటువంటి పదాలను ప్రయోగిస్తే, వాటిని పట్టించుకోకపోవటమే శ్రేష్టం, అతడే మనిషి అనిపించుకోవటానికి అర్హుడు.

## సహించుకోకండి, పరిష్కరించుకోండి.

**ప్రశ్నకర్త :** దాదా, విభేదాలను మానండి అని మీరు చెప్పిన దానికి అర్థం సహనాన్ని పాటించమనే కదా?

**దాదాశ్రీ :** విభేదాలను మానటం అంటే సహించటం కాదు, సహనశక్తికి ఒక పరిమితి ఉంటుంది. ఎంతని నీవు సహించగలవు? సహనం అంటే స్ప్రింగ్‌ను అణచి పెట్టటం లాంటిదే. ఎంతకాలం స్ప్రింగ్‌ని అణచిపెట్టగలవు? అందువల్ల సహనాన్ని నేర్చుకోవద్దు. ఎల పరిష్కరించుకోవాలో నేర్చుకోవాలి. ఈ పరిజ్ఞానం లేకపోతే అన్ని పరిస్థితులనూ సహించుకోవటం తప్ప వారికి వేరే మార్గం లేదు. ఏదో ఒకరోజు అణచిపెట్టబడిన స్ప్రింగ్ రెట్టింపు శక్తితో పైకిలేచి నష్టాన్ని కల్గిస్తుంది. అటువంటిదే ప్రకృతి నియమం.

ఎవరి కారణంగానో మనం సహించాలి అనే చట్టం ప్రపంచంలో లేదు. ఎవరి చర్యలనైనా నీవు సహిస్తున్నావంటే అది గత జన్మలోని కర్మల ఫలంగా ఏర్పడిన నీ ఖాతా వల్లనే. ఆ ఖాతా ఎలా వచ్చిందో నీకు తెలియదు కనుక అది నిష్కారణంగా నీకు ప్రాప్తించిందని భావిస్తావు. ఎవరూ కొత్త ఖాతాని సృష్టించరు. పూర్వ జన్మ కర్మఫలమే ఇపుడు తిరిగి నీకు వస్తుంది. మా జ్ఞానంలో (ఆత్మ సాక్షాత్కారజ్ఞానం) సహించుకోవలసిన పనిలేదు. మా జ్ఞానం వల్ల ఎదుటివ్యక్తి శుద్ధాత్మ అని, అతను మా పాత ఖాతాలను సెటిల్ చేసే పరికరం మాత్రమే అని గ్రహిస్తాం. ఈ జాగృతి పజిల్‌ను సాల్వ్ చేస్తుంది.

**ప్రశ్నకర్త :** అయితే ఇవి అన్నీ పెండింగ్ ఖాతాలని అందువల్లనే ఇపుడు తలెత్తాయని అంగీకరించి మనస్సును సమాధాన పరచుకోవాలా?

**దాదాశ్రీ :** ఆ వ్యక్తి స్వయంగా శుద్ధాత్మ. అది అతని ప్రకృతి. భావము, భాష, చర్య వీటి ద్వారా ఫలితాలను ఇచ్చేది ప్రకృతి. మీరూ శుద్ధాత్మ, అతడూ శుద్ధాత్మ. మీ యిద్దరి ప్రకృతులు ఒకదాని ఖాతాను మరొకటి సెటిల్ చేస్తున్నాయి. ఎదుటి వ్యక్తి భావనలు – భాష–చర్యల ద్వారా మిమ్మల్ని బాధిస్తున్నట్లు కన్పించేది సమస్తమూ మీ కర్మల యొక్క ఉదయం వల్లనే. ఎదుటివ్యక్తి కేవలం నిమిత్తమాత్రుడు. మన ఖాతా సెటిల్ కాగానే అతను తిరిగి వెళ్ళిపోతాడు. ఈ (ప్రకృతి) విధానాన్ని మీరు యధాతథంగా గ్రహించగలిగితే సహించుకోవటం అనే ప్రసక్తే లేదు. అవతలి వ్యక్తిని శుద్ధాత్మగాను, అతని ప్రకృతి మీ పట్ల ప్రకటితమవుతున్నది కేవలం ఆ వ్యక్తితో మీకు గల ఖాతాను సెటిల్ చేయటం కోసమేనని గ్రహిస్తేచాలు. ఈ జ్ఞానం వల్ల సహించవలసిన అవసరం రాదు.

మీరు సహించుకోవటం వల్ల ఏమౌతుందో తెలుసా! ఏదో ఒక రోజు స్ప్రింగ్ ఉవ్వెత్తున లేస్తుంది. స్ప్రింగ్ ఆ విధంగా లేవటం చూశారా? నా స్ప్రింగ్ చాలాసార్లు అలా వేగంగా లేచేది. కొన్ని రోజులపాటు సహించుకొనేవాణ్ణి. ఆ తర్వాత ఒకరోజు స్ప్రింగ్ లేచి అంతా అస్తవ్యస్తం చేసేది. సహించుకోవటమన్నది అజ్ఞానదశలో జరుగుతుంది. అది నాకు బాగాగుర్తు ఉంది. అందువల్లనే సహనాన్ని నేర్చుకోవద్దని మీకు చెప్తున్నాను. సహనము అనేది కేవలం అజ్ఞానదశలోనే జరుగుతుంది. ఈ జ్ఞానం ద్వారా మీకు వివరించేది ఏమంటే ప్రతిచర్యకి వెనుక ఉన్న కారణం ఏమిటో అర్థం చేసికోండి. దాని పరిణామం ఏమిటో గ్రహించండి.

మన పాత పెండింగ్ ఖాతాల వల్లనే అంతా జరుగుతుందని, మన ఖాతాకు సంబంధంలేనిదే ఏదీ జరగదని తెలుస్తుంది.

## ఘర్షణ - కేవలం మీ పొరపాటు వల్లనే

ఈ ప్రపంచంలో మీకు ఎదురయ్యే వివాదాలన్నింటికీ పూర్తిగా మీ పొరపాట్లే కారణం. ఎవరినీ నిందించవలసిన పనిలేదు.ప్రజలు ఏదో ఒక రకంగా ఘర్షణ పడ్తుంటారు. 'వివాదంలో ఎందుకు చిక్కుకొన్నారు?' అని అడిగితే 'అతని కాణంగానే, అతనే వివాదానికి దిగాడు' అని చెప్తారు. అవతలి వ్యక్తి అంధుడైతే మీరు కూడా అంధులే కావాలా?

**ప్రశ్నకర్త :** ఒక వివాదంలో మరొక వివాదాన్ని మనం సృష్టిస్తే ఏమి జరుగుతుంది?

**దాదాశ్రీ :** తల బ్రద్దలౌతుంది. వివాదం తలెత్తినపుడు మనం అర్థం చేసికోవలసినది ఏమిటి?

**ప్రశ్నకర్త :** అది నా పొరపాటే అని.

**దాదాశ్రీ :** అవును. ఆ పొరపాటును నీవు వెంటనే అంగీకరించాలి. ఎప్పుడైనా వివాదం జరిగితే దానికి కారణమైన పొరపాటు ఏదో నీ వల్లనే జరిగిందని గుర్తించాలి. ఆ పొరపాటు నీదేనని గ్రహించగలిగితే, పజిల్ సాల్వ్ అయినట్లే. నీవు ఎదుటివ్యక్తిలో తప్పుని వెదుకుతున్నంత వరకు పజిల్ సాల్వ్ కాదు.

తప్పుమనదేనని గుర్తించి అంగీకరిస్తే ఈ ప్రపంచం నుంచి స్వేచ్ఛని పొందగలం. ఇంతకంటే వేరే పరిష్కారం లేదు. వేరే విధంగా దీనిని పరిష్కరించాలని ప్రయత్నిస్తే అది మరింత జటిలమౌతుంది. అదీ మీ సూక్ష్మ అహంకార కారణంగా. నివారణోపాయాలను ఎందుకు వెదుకుతారు.? ఎదుటివ్యక్తి ఆ తప్పు మీదేనని మీతో చెప్పినట్లయితే దానిని మీరు అంగీకరించి మీ పొరపాటుని మీరు గుర్తించినట్లుగా చెప్పాలి.

లౌకిక జీవితంలో వివాదాలకు బుద్ధేకారణం. బుద్ధిని అనుకరిస్తే పతనం తప్పదు. రాత్రి రెండు గంటలసమయంలో నిద్రలేపి మీకు అంతా వ్యతిరేకంగా చూపిస్తుంది. ఈ బుద్ధి చివరకు ఆత్మ వినాశనానికి కారణమౌతుంది.

మీరు మోక్షాన్ని కాంక్షించినట్లయితే బుద్ధిని సర్వదా విస్మరించాలి. దాని సలహాలను పట్టించుకోకూడదు. బుద్ధి ఎటువంటిదంటే జ్ఞాని పురుషులలో కూడ తప్పుల్ని చూపిస్తుంది. ఎవరిద్వారా నువ్వు ముక్తిని పొందవలసిఉన్నదో వారిలోనే తప్పుల్ని చూడటమా? ఆ విధంగా చేస్తే నీకు మోక్షం అనంత జన్మల వరకు దూరంగా ఉంటుంది.

విభేదాలకు కారణం మన అజ్ఞానమే. ఎవరితోనైనా ఘర్షణ జరిగితే అది మన అజ్ఞానానికి గుర్తు. సత్యా సత్యాలను భగవంతుడు చూడడు. ఏ పరిస్థితిలోనయినా వివాదానికి తలపడ్తున్నామా అని మాత్రమే భగవంతుడు చూస్తాడు. భగవంతుని దృష్టిలో న్యాయము, అన్యాయము ఉండవు. భగవంతుని వద్ద ద్వంద్వాలకు స్థానం లేదు. ఏ పరిస్థితుల్లోనైనా సరే ఎవరితోనూ వివాద పడకుండా ఉండటమే భగవంతునికి కావలసినది.

## వివాదానికి తలపడే వారంతా గోడలు

నువ్వు ఒక గోడను గుద్దుకుంటే తప్పు ఎవరిది? నీదా? లేక గోడదా? నీ దారికి అడ్డుతొలగమని గాని నిన్ను గుద్దుకున్నందుకు నీకు న్యాయం చేయమని గాని నీవు గోడని అడిగితే ప్రయోజనం ఉంటుందా? మీరు గోడను తప్పించుకొని వెళ్లకుండా మీరు నిర్ణయించుకొన్న విధంగా వెళ్తే ఎవరితల బ్రద్దలౌతుంది?

**ప్రశ్నకర్త :** నాది.

**దాదాశ్రీ :** అందువల్ల జాగ్రత్తగా ఉండవలసినది ఎవరు? తప్పు ఎవరిది? ఎవరు గాయపడ్డారో వారిదే తప్పు. ఈ ప్రపంచం గోడలాంటిదే.

నువ్వు వెళ్ళి ఒక గోడకు లేక తలుపుకు గుద్దుకుంటే దర్వాజతో గాని, గోడతో గాని, నీకు ఏమైన అభిప్రాయభేదం కల్గుతుందా?

**ప్రశ్నకర్త :** దర్వాజ నిర్జీవ వస్తువు కదా!

**దాదాశ్రీ :** ప్రాణమున్న వస్తువు విషయంలో మాత్రమే, నీతో విభేదానికి అది కారణమని భావిస్తావన్నమాట. ఈ ప్రపంచంలో విభేదానికి కారణమైన ప్రతీదీ నిర్జీవమైనదే. జీవమున్నది ఏదీ విభేదించదు. నిర్జీవ వస్తువే విభేదిస్తుంది. అందువల్ల నీవు దానిని గోడగానే భావించి, ఇకమీదట జోక్యం చేసికోకుండా

ఉండు. ఒకవేళ అలా విభేదం ఏర్పడినా కొంతసేపటి తర్వాత మామూలుగా టీ త్రాగటానికి ఆహ్వానించాలి.

ఒక పిల్లవాడు ఒక రాయిని నీ మీదకు విసిరాడనుకొందాం. ఆ కారణంగా నీకుగాయమై రక్తం స్రవిస్తుంటే. ఆ పిల్లవాడిపట్ల నీ ప్రతిచర్య ఎలా వుంటుంది? ఆ పిల్లవాడు తన పొరపాటును ఒప్పుకొన్నప్పటికి అతనిపై కోపగిస్తావా? నీవు వెళ్తుంటే కొండమీదనుంచి ఒక రాయి దొర్లి నీమీదపడి గాయమైందనుకో, కోపగిస్తావా? కోపగించవు. కారణమేమంటే ఆ రాయి పర్వతం మీద నుంచి పడింది దానిని ఎవరూ నీ మీదకు విసరలేదు. దానికి ఎవరూ కారణం కాదు.

నీవు ప్రపంచాన్ని అర్థం చేసికోవటం నేర్చుకోవాలి. నువ్వు నా వద్దకు వస్తే నీకు చింత అనేది లేకుండా చేస్తాను. నీవు నీ భార్యతో ఆనందంగా జీవించవచ్చు, ప్రపంచంలో హాయిగా విహరించవచ్చు. పిల్లల వివాహం జరిపించి ఆనందించవచ్చు. నీ భార్యని సంతోషపెట్టవచ్చు. ఆమె ఆనందంతో "నా భర్తను మీరు చాలా తెలివిగా తీర్చిదిద్దారు అని ఒప్పుకొంటున్నాను" అని నాతో చెప్తుంది.

నీ భార్యకి పొరుగింటివారితో జగడమైందనుకోండి. ఆమె బుర్ర ఆ కారణంగా వేడెక్కి మీరు బయటినుంచి ఇంటికి తిరిగిరాగానే ఆ విషయాన్ని ఉద్రేకంతో మీకు చెప్పటం ప్రారంభించిందనుకోండి. అపుడు మీరేమి చేస్తారు? మీరు కూడా కోపోద్రిక్తులౌతారా? అటువంటి పరిస్థితి ఎదురైతే మీరు సర్దుకుని పోగలగాలి. ఆ విధంగా ఆమె ఉద్రిక్తతకు గురికావటానికి కారణం ఎవరో, ఏమిటో మీకు తెలియదు. మీరు పురుషులైనందువల్ల వివాదం చోటుచేసికోవటాన్ని ఆమోదించరు. ఆమె మీతో వాదన మొదలుపెడితే ఆమెను సమాధానపరచండి. అభిప్రాయభేదం అంటే అర్థం ఘర్షణే.

## సైన్సుని ఇలా అర్థం చేసికోవాలి

**ప్రశ్నకర్త :** నేను వివాదాలకు దూరంగా ఉండాలనుకొన్నప్పటికీ, ఎదుటివ్యక్తి కావాలని నాతో పోట్లాటకు దిగితే నేను ఏమి చేయాలి?

**దాదాశ్రీ :** ఈ గోడతో నువ్వు యుద్ధం చేయదల్చుకొంటే ఎంతసేపు యుద్ధం చేయగలవు? నీవు నడుస్తూ గోడకు గుద్దుకొన్నావనుకో. నీతలకి

దెబ్బతగిలితే నీవు తిరిగి గోడనుకొడతావా? అదే విధంగా నీకు క్లేశాన్ని కల్గించేవారంతా గోడలే. ఎదుటివ్యక్తిని నిందించవలసిన పనిఏముంది? ఆ వ్యక్తి గోడతో సమానమని మనకి మనమే తెలియచెప్పుకోవాలి. ఆ విధంగా చేస్తే సమస్యలు, కష్టాలు ఉండవు.

**ప్రశ్నకర్త :** మనం మౌనంగా ఊరుకొంటే అవతలి వారు మరింత ఉద్రిక్తులై రెచ్చిపోయి దోషం మనదేనని భావించి ఇంకా ఎక్కువ క్లేశాన్ని కల్గిస్తారు.

**దాదాశ్రీ :** నీవు మౌనంగా ఉండటం వల్లనే అలా జరిగిందని అనుకొంటున్నావా? నీవు అర్ధరాత్రి లేచి బాత్‌రూమ్‌కి వెళ్ళేసమయంలో చీకట్లో గోడకు కొట్టుకొంటే, అది కూడా నీ మౌనం వల్లనే జరిగినట్లా? నీవు మాట్లాడు లేక మౌనంగా వుండు. జరిగిన దానికి, నీ మాట లేక మౌనానికి సంబంధం లేదు. నేను మౌనంగా ఉంటే ఎదుటి వ్యక్తికి చులకన అవుతున్నాను అని ఏమీ లేదు. నేను మాట్లాడినందువల్లనే ఇలా జరిగింది అని కూడ ఏమీ లేదు. నీ మాట గాని, నీ మౌనంగాని ఒక వ్యక్తిని ప్రభావితం చేయలేదు. ఏ వ్యక్తి స్వతంత్రంగా పరిస్థితిని మార్చలేదు. ఇది కేవలం సైంటిఫిక్ సర్కమ్‌స్టెన్షియల్ ఎవిడెన్స్ (కేవలం వైజ్ఞానిక సంయోగిక ప్రమాణము)

ఎవరికీ స్వంతంగా ఏమీ చేయగల శక్తి లేదు. ఈ జగత్తు పూర్తిగా సత్తా విహీనమైనది. అలాంటపుడు ఈ ప్రపంచంలో దేనినైనా ఎవరు పాడుచేయగలరు? ఒకవేళ గోడకి శక్తి వుంటే, ఎదుటివ్యక్తి వద్ద కూడ శక్తి వుంటుంది. ఈ గోడకి మనతో పోట్లాడే శక్తి వుందా? ఎదుటివ్యక్తికి కూడ అంతే. ఆ వ్యక్తి కేవలం నిమిత్తమాత్రుడు. ఆ వివాదం జరగవలసి వుంది. దానిని తప్పించలేము. వ్యర్థంగా అరచి ప్రయోజనం ఏమిటి? అతని చేతిలో ఏ శక్తీ లేదు. అందువల్ల మీరు గోడలా వుండండి మౌనంగా. మీరు మీ భార్యను తిడ్తుంటారు కాని ఆమె లోపల విరాజమానుడై వున్న పరమాత్మ దానిని నోట్ చేసికొంటాడు. ఒకవేళ మీ భార్య మిమ్మల్ని తిడ్తుంటే మీరు గోడలా ఉండండి మీలో విరాజమానుడైన పరమాత్మ మీకు సహాయం చేస్తాడు.

అందువల్ల మీకు గోడగుద్దుకోవటానికి కారణం మీరే. ఆ తప్పు మీదే. అందులో గోడతప్పు ఏమి లేదు. ప్రజలు నన్ను అడుగుతుంటారు."అయితే

మనుష్యులంతా గోడలేనా?" అవును. వాళ్ళంతా గోడలే. నేను అంతరదృష్టితో చూచి చెప్తున్నాను. ఇందులో అసత్యం ఎంతమాత్రమూ లేదు.

ఎవరితోనైనా అభిప్రాయభేదం కారణంగా వివాదానికి దిగటం, గోడకి గుద్దుకోవటం ఈ రెండూ సమానమే. ఎటువంటి భేదమూ లేదు. ఇద్దరూ గ్రుడ్డివాళ్ళే. చూడలేని కారణంగానే ఒకరు గోడకు గుద్దుకొంటారు. చూడలేని కారణం గానే ఒక వ్యక్తి వివాదానికి దిగుతాడు. ముందు ఏమి ఉన్నదో కన్పించకపోవటం వల్లనే ఆ వ్యక్తి గోడకు గుద్దుకుంటాడు. రాబోయే పరిణామం ఏమిటో గ్రహించలేక అభిప్రాయభేదాన్ని ఏర్పరచుకొంటాడు. ముందుచూపులేని కారణంగానే క్రోధం, అభిమానం, మాయా, లోభాలు తలెత్తుతాయి. ఈ విధంగా విషయాన్ని అర్థం చేసికోవాలి. గోడది దోషం కాదు. దానికి గుద్దుకొని గాయపడిన వ్యక్తిదే దోషం. ఈ ప్రపంచంలో అందరూ గోడలే. నువ్వు గోడకుగుద్దుకొంటే దోషం ఎవరిది అని నువ్వు వెతకవు. ఎవరు తప్పు ఎవరు ఒప్పు అని నిరూపించవలసిన అవసరం లేదు.

నీతో విభేదానికి తలపడుతున్నవారిని గోడలుగా భావించు. చీకటిలో ద్వారము ఎక్కడుందో తెల్సుకొనే ప్రయత్నం చేస్తే నీవు ద్వారాన్ని కనుక్కోగలవు. చేతులతో తడుముకొంటూ తడుముకొంటూ వెళ్తే ద్వారం చేరగలవా? లేదా? మళ్ళీ వెనక్కి తిరిగి వచ్చేటపుడు కూడ దేనికీ గుద్దుకోకుండా రావాలి. ఎవరితోనూ ఎపుడూ ఎటువంటి వివాదానికి తావివ్వకూడదు, ఎవరితోనూ విభేదించకూడదు అనే నియమాన్ని పాటించాలి.

## ఈ విధమైన జీవితాన్ని జీవించాలి.

ఎవరికీ ఏ విధంగా జీవించాలో తెలియదు. వారికి వైవాహిక జీవితాన్ని గురించి కూడ అవగాహన ఉండదు. అయినా ఆ వివాహబంధంలో చిక్కుకుంటారు. తల్లిదండ్రులు ఎలా వుండాలో వారికి తెలియదు. అయినా తల్లిదండ్రులైపోతారు. మీ పిల్లలకు ఆనందాన్ని సంతోషాన్ని యిచ్చే విధంగా మీరు జీవించాలి. ఎవరితోనూ వివాదంలోకి దిగకూడదని ప్రతీ ఉదయం కుటుంబంలోని సభ్యులంతా ఎవరికి వారే గట్టిగా నిశ్చయించుకోవాలి. విభేదాల వల్ల కలిగే లాభం ఏమిటి?

**ప్రశ్నకర్త :** మనకే బాధ కల్గుతుంది.

**దాదాశ్రీ :** అంతే కాదు. ఆ దినమంతా అస్తవ్యస్తంగానే గడుస్తుంది. ఇంకా పెద్ద నష్టం ఏమంటే వచ్చే జన్మలో మనిషిగా పుట్టే అవకాశాన్ని కోల్పోతావు. నీలో మంచితనం, సత్ప్రవర్తన ఉంటేనే మానవజన్మను పొందే అర్హత నీకు లభిస్తుంది. కానీ నీవు పశుప్రవృత్తి కల్గి అందర్నీ కొమ్ములతో పొడుస్తూ, యుద్ధం చేస్తూ వుంటే నీవు మరల మనిషిగా జన్మించే అవకాశం ఉంటుందా? కొమ్ములను వుపయోగించేవి ఏవి? ఎద్దులా లేక మనుష్యులా?

**ప్రశ్నకర్త :** మనుష్యులే వాటిని ఎక్కువగా ఉపయోగిస్తున్నట్లుగా అన్పిస్తుంది.

**దాదాశ్రీ :** మనిషి ఆ విధంగా హాని కల్గిస్తే అతనికి పశుజన్మ ప్రాప్తిస్తుంది. అపుడు రెండు కాళ్ళకు బదులు నాల్గు కాళ్ళు (చతుష్పాదజన్మ) అదనంగా తోక కూడ లభిస్తుంది. ఆ జీవితంలో దు:ఖం కాక ఇంకేమీ వుండదు. జంతుగతి ప్రాప్తిస్తే జీవితం దుర్భరం అవుతుంది. అన్నీ బాధలు, కష్టాలతోనే కూడి వుంటుంది ఆ జీవితం. ఈ విషయాన్ని మీరు బాగా అర్థం చేసికోవాలి.

## ఘర్షణ - మన అజ్ఞానానికి చిహ్నం

**ప్రశ్నకర్త :** సుహృద్భావం లేకపోవటమే జీవితంలో విభేదాలకు కారణమా?

**దాదాశ్రీ :** విభేదాలతో కూడినదే సంసారం. సంసారం విభేదాలతోనే నిండి వుంటుంది.

**ప్రశ్నకర్త :** విభేదాలకుకారణం ఏమిటి?

**దాదాశ్రీ :** అజ్ఞానమే. ఎక్కడైనా ఎవరితోనైనా మనకు అభిప్రాయ భేదం వచ్చిందంటే అది మన నిర్బలతకి చిహ్నం. అది ప్రజల దోషం కాదు. విభేదించటంలో దోషం నీదే. ఎవరైనా ఉద్దేశ్యపూర్వకంగా వివాదానికి పాల్పడితే మీరు వారిని క్షమాపణ కోరాలి. పొరపాటు జరిగింది తెలియలేదు అని చెప్పాలి. ఎక్కడ వివాదం ఉంటే అక్కడ నీ దోషం ఉంటుంది.

**ప్రశ్నకర్త :** మనం ప్రమాదాలను నివారించాలనుకొంటాం. కానీ ఒక స్తంభం మీకు అడ్డువస్తే దానిని చుట్టి వెళతారు. అయినా స్తంభం వచ్చి మీ మీదపడితే అపుడు ఏమి చేయాలి?

**దాదాశ్రీ :** అది పడితే అక్కడి నుంచి వెంటనే తప్పుకోవాలి.

**ప్రశ్నకర్త :** తప్పించుకోవాలని ఎంత ప్రయత్నించినా స్తంభం మీదపడి గాయపర్చవచ్చు. ఉదాహరణకు నా భార్యనే తీసికోండి.

**దాదాశ్రీ :** అటువంటి వివాదం సంభవించినపుడు మీరు పరిష్కారం కనుక్కోవాలి.

**ప్రశ్నకర్త :** ఎవరైన మనల్ని అవమానిస్తే, మనం పరాభవింపబడినట్లు భావిస్తే దానికి కారణం మన అహంకారమా?

**దాదాశ్రీ :** వాస్తవానికి ఎవరైనా మిమ్మల్ని అవమానిస్తే, అతడు మీ అహంకారాన్ని తొలగిస్తున్నాడన్నమాట. అయినప్పటికీ ఆ అవమానం మన అహంకారాధిక్యతను మాత్రమే పోగొడ్తుంది. దానివల్ల మనకి వచ్చే నష్టం ఏముంది? అహంకారం కర్మబంధాలనుంచి మనల్ని ముక్తులను చేయదు.

## సముద్రంలా అన్నింటినీ నీలోనే వుంచుకో.

**ప్రశ్నకర్త :** దాదా! నిత్య జీవితంలో పెద్దవాళ్ళు చిన్నవాళ్ళని తప్పుపడ్తారు. చిన్నవాళ్ళు తమకంటె చిన్నవాళ్ళని తప్పుపడ్తారు. ఎందుకిలా జరుగుతుంది?

**దాదాశ్రీ :** అది అంతే. పెద్దవాళ్ళు చిన్నవాళ్ళలో తప్పుల్ని వెదకి వారిని నియంత్రించాలని ప్రయత్నిస్తారు. దానికంటె తప్పుని అంగీకరించి పొరపాటుకి బాధ్యత మనమే వహిస్తే సమస్య తేలికగా పరిష్కారమౌతుంది. ఎదుటివ్యక్తికి సహనశక్తి లేకపోతే ఆ పొరపాటును నేనే నెత్తిపైన వేసికొంటాను. ఎదుటి వారిని నిందించను. ఎదుటివారిని ఎందుకు దోషిగా చూడాలి? సముద్రంలాంటి విశాలమైన ఉదరం ఉందినాకు అన్నింటినీ దాచుకోవటానికి. నదులలోని నీరంతా సాగరగర్భంలో యిమడటం లేదా? అలాగే మనమూ అంతా యిముడ్చుకోవాలి. దాని ప్రభావం పిల్లలపైన, ఇతరులపైన కూడ పడ్తుంది, వారు మన ప్రేమను అనుభవిస్తారు. వారు ఆ విధమైన సుహృద్భావాన్ని అలవరచుకొంటారు. మన

విశాల హృదయాన్ని వారూ గ్రహిస్తారు. నీకు ఏది లభించినా దానిని డిపాజిట్ చేయి. ఒక వ్యక్తి నిన్ను అవమానిస్తే అతని శక్తిని నీకిచ్చి వెళ్తున్నాడన్నమాట. ఇది ప్రపంచ నియమం. అందువల్ల దానిని ఆనందంగా స్వీకరించు.

## సంఘర్షణ కూడ మన ప్రారబ్దమే

**ప్రశ్నకర్త :** మనం విభేదాలను నివారించాలని, సమభావంతో సమాధాన పరచాలని ఎన్ని విధాల ప్రయత్నించినప్పటికీ ఎదుటివ్యక్తి మనలను బాధపెడ్తూ, అవమానిస్తే మనం ఏమి చేయాలి?

**దాదాశ్రీ :** చేయతగింది ఏమీ లేదు. అది మన ఖాతాయే కనుక సమభావం కల్గి సమాధానపడాలి. మన నిబంధనల్లో మనం ఉంటూ మన పజిల్‌ను మనమే సాల్వ్ చేసుకోవాలి.

**ప్రశ్నకర్త :** వివాదం ఏమి జరిగినా వ్యవస్థిత్ యొక్క ఆధారంపైనే (నిర్ణయించబడిన మేరకే) జరుగుతుంది కదా?

**దాదాశ్రీ :** వ్యవస్థిత్ (సైంటిఫిక్ సర్కమ్‌స్టెన్షియల్ ఎవిడెన్స్) ఆధారంగానే వివాదం చోటుచేసుకొంటుంది. కాని ఆ విధంగా మనం ఎపుడు చెప్పుకోవాలి? వివాదం అయిపోయిన తర్వాత. 'మనం ఏ వివాదానికి తావివ్వకూడదు' అని మనం నిశ్చయించుకోవాలి. ఎదురుగా స్తంభం ఉంటే దానిని చూసిన తర్వాత ప్రక్కనుంచి తప్పుకొనివెళ్లాలే గాని దానిని గుద్దుకోకూడదు కదా ! మనం జాగ్రత్తగా తప్పుకొని వెళ్ళే ప్రయత్నం చేసిన తర్వాత కూడ ప్రమాదం జరిగితే (దెబ్బతగిలితే) అపుడు 'ఇది వ్యవస్థిత్' అని చెప్పుకోవాలి. అలా కాకుండా ముందునుంచే 'వ్యవస్థితమైవుంది' (నిర్ణయింపబడివుంది) అని భావించి మనం వివేకరహితంగా ముందుకు వెళితే 'వ్యవస్థిత్' ని దురుపయోగం చేసినట్లవుతుంది.

## ఘర్షణవల్ల ఆత్మశక్తి వినష్టం

ఘర్షణ వల్ల ఆత్మశక్తి పూర్తిగా వినష్టమైపోతుంది. మీరు ఏదైనా ఘర్షణలో పాలుపంచుకొంటే, ఆత్మశక్తిని నష్టపర్చుకొన్నట్లే. ఎవరైనా మిమ్మల్ని ఘర్షణకు రెచ్చగొట్టినా, పురికొల్పినా సరే, దాని నుంచి మీరు తప్పుకోవాలి. ఘర్షణ జరగనేజరగకూడదు. మీ ప్రాణనష్టం జరిగితే జరుగు గాక కాని ఎట్టి పరిస్థితుల్లోను

ఘర్షణకు మాత్రం చోటు యివ్వకూడదు. జీవితంలో ఘర్షణకు చోటు యివ్వకుండా ఉంటే ఆ వ్యక్తి మోక్షాన్ని పొందగలడు. 'ఘర్షణకు తావివ్వకూడదు' అనే ఒక్కదానిని నేర్చుకొంటే అపుడు వాళ్ళకి ఏ గురువుయొక్కగాని, మరే మాధ్యమం యొక్కగాని అవసరం లేదు. ఒకటి లేక రెండు జన్మలలో మోక్షానికి వెళ్ళిపోతారు. 'ఘర్షణకి దిగకూడదు' అని ధృఢంగా నిశ్చయించుకొని, దానిని పాటిస్తే అది జ్ఞానప్రాప్తికి చిహ్నం. 'నేను ఘర్షణలో లేక వివాదంలోకి వెళ్ళకూడదు' అని నిశ్చయించుకొంటే వారు తప్పక జ్ఞానులౌతారని నేను గ్యారంటీ యిస్తాను. దేహానికి గాయమైతే మందులతో మాన్పవచ్చు. కాని ఘర్షణవల్ల మనసుకి, బుద్ధికి గాయమైతే దానిని ఎలా మాన్పగలం? వేల జన్మలకి కూడ ఆ గాయాల గుర్తులు పోవు.

**ప్రశ్నకర్త :** ఘర్షణ మరియు సంఘర్షణ వల్ల మనస్సు, బుద్ధి గాయపడ్తాయా?

**దాదాశ్రీ :** కేవలం మనస్సు, బుద్ధి మాత్రమే కాదు. అంత:కరణ మొత్తం గాయపడ్తుంది. దాని ప్రభావం శరీరం మీద కూడ కన్పిస్తుంది. ఘర్షణ వల్ల చాలా కష్టాలు చోటుచేసుకొంటాయి.

**ప్రశ్నకర్త :** ఘర్షణ, వివాదాల వల్ల ఆత్మశక్తి వినష్టమౌతుందని మీరు చెప్పారు. జాగృతివల్ల ఆ శక్తులను వెనక్కి లాగి తెచ్చుకోగలమా?

**దాదాశ్రీ :** మీరు శక్తులను వెనక్కి లాగవలసిన అవసరం లేదు. ఆత్మశక్తి యిప్పటికీ వున్నది. ఇపుడు ఉత్పన్నమౌతూనే వుంది. గత జన్మలో ఘర్షణల కారణంగా మీరు కోల్పోయిన శక్తి అంతా ఇపుడు తిరిగి మీకు లభిస్తుంది. కానీ యిపుడు మరల కొత్త ఘర్షణ జరిగితే మరల శక్తి వినష్టమౌతుంది. వచ్చిన శక్తులు ఆ విధంగా వినష్టమైపోతూవుంటాయి. మనకు అసలు ఘర్షణ అనేదే లేకుంటే ఆత్మశక్తులు వృద్ధిపొందుతూ వుంటాయి. ఈ ప్రపంచంలో ప్రతీకారేచ్ఛ కారణంగానే ఘర్షణ జరుగుతుంది. వైరమే సంసార వృక్షానికి బీజం. ఎవరైతే వైరాన్నుంచి, ఘర్షణ నుంచి నివృత్తులవుతారో వారు ముక్తులౌతారు. ప్రేమవల్ల ఎటువంటి ప్రతిబంధమూ లేదు. శత్రుత్వం పోతే ప్రేమ ఉత్పన్నమౌతుంది.

## కామన్ సెన్స్ - ప్రతిచోట ఉపయోగించాలి.

వ్యవహారశుద్ధికి కావలసినది ఏమిటి? సంపూర్ణమైన కామన్‌సెన్స్ (సంపూర్ణ

వ్యావహారిక జ్ఞానం) కావాలి. స్థిరత, గంభీరత కల్గి ఉండాలి. ప్రపంచ వ్యవహారాలలో కామన్‌సెన్స్ అవసరం. కామన్‌సెన్స్ ప్రతీ విషయంలోనూ ప్రతీచోట అన్వయించుకోవాలి. స్వరూపజ్ఞానంతో పాటు కామన్‌సెన్స్ కూడ కల్గి వుంటే ఆ వ్యక్తి ప్రకాశిస్తాడు.

**ప్రశ్నకర్త :** కామన్‌సెన్స్ ఏ విధంగా అభివ్యక్తమౌతుంది?

**దాదాశ్రీ :** ఎవరైనా మీతో వివాదానికి పాల్పడినా మీరు వారితో ఘర్షణ పడకుండా వుంటే అపుడు కామన్‌సెన్స్ ఉత్పన్నమౌతుంది. మీరు ఎవరితోనైనా ఘర్షణపడితే మీరు కామన్ సెన్స్‌ని కోల్పోతారు. మీ వైపు నుంచి ఎటువంటి ఘర్షణ వుండరాదు.

మీతో ఎదుటి వ్యక్తి ఘర్షణ వల్ల మీ కామన్‌సెన్స్ ఉత్పన్నమౌతుంది. ఘర్షణ సందర్భంలో మీరు ఎలా వ్యవహరించాలో మీకు ఆత్మశక్తి చూపిస్తుంది. ఒకసారి ఆత్మశక్తి చూపించే ఉపాయాన్ని మీరు చూచిన తర్వాత ఆ జ్ఞానం ఎప్పటికీ పోదు. అంతేకాదు. మీ కామన్‌సెన్స్ ఇంకా పెరుగుతుంది. నేను ఎవరితోనూ ఘర్షణపడను. అందువల్లనే, నాకు అద్భుతమైన కామన్‌సెన్స్ వుంది. అందువల్లనే మీరు ఏమి చెప్పదల్చుకొన్నారో (మీ మాటల వెనుక భావాన్ని) నేను వెంటనే అర్థం చేసికోగలను. కాని తాము చెప్తున్నమాటలు దాదాకి హానికరమని ఇతరులు భావించవచ్చు. కాని ఆ హాని నిజమైన హాని కాదని నేను వెంటనే గుర్తిస్తాను. వ్యవహార దృష్టిలోనూ, ధార్మిక దృష్టిలోనూ కూడ అది హానికరం కాదు. ఆత్మ సంబంధంగా చూస్తే అహితమన్నది లేనేలేదు. అది ఆత్మకు అహితమని ఇతరులు తలంచవచ్చు కాని దానిలోని హితాన్ని నేను గ్రహించగలను. ఇదంతా కామన్‌సెన్స్ యొక్క ప్రభావం. అందువల్లనే కామన్‌సెన్స్ ప్రతీవిషయంలోనూ అవసరం అని నిర్వచించాను. నేటి తరానికి కామన్‌సెన్స్ లోపించింది. ఒకతరం నుంచి మరొక తరానికి కామన్‌సెన్స్ తగ్గిపోతూ వుంది.

ఈ విజ్ఞానం లభించిన తర్వాత మనుష్యులు ఘర్షణ లేకుండా ఉండగల్గుతారు. ఈ విజ్ఞానాన్ని పొందకపోయినప్పటికీ, ఘర్షణలు లేకుడా జీవించగల్గిన పుణ్యశాలురు ఏ కొద్దిమందో ఉండవచ్చు. అయితే అది కొన్ని సందర్భాలలో మాత్రమే, అన్ని పరిస్థితులలోనూ కాదు.

ఈ జ్ఞానంతో వివాదసమయాలలో వ్యవహరించగలిగితే ఆధ్యాత్మికంగా పురోగతి లభిస్తుంది. ఘర్షణ తీవ్రత ఎంత ఎక్కువగా ఉంటే అంతగా పురోగమనం వుంటుంది. ఘర్షణే లేకుంటే మీరు ఉన్నచోటే ఉంటారు. అందుచేతనే మనుష్యులు ఘర్షణను వెదుకుతుంటారు.

## సంఘర్షణ ద్వారా ప్రగతి మార్గం లోనికి

**ప్రశ్నకర్త :** ఆధ్యాత్మిక ప్రగతికి సంఘర్షణ దోహదపడ్తుందని తెల్సుకొని దానికోసం అన్వేషిస్తే ప్రగతి లభిస్తుందా?

**దాదాశ్రీ :** అవును, కాని ప్రజలు ఆ విధంగా అర్థంచేసికొని, ఆ దృష్టితో చూడరు. భగవంతుడు నిన్ను ఉన్నతస్థితికి తీసికెళ్ళడు, సంఘర్షణ తీసికెళ్తుంది. సంఘర్షణ ఒక హద్దు మేరకే నిన్ను పైకి తీసికెళ్తుంది. ఆ తర్వాత జ్ఞాని మాత్రమే నీకు సహాయపడగలడు. సంఘర్షణ ప్రకృతి విధానం వల్లనే వస్తుంది. నది అడుగు భాగంలో ఉండే రాళ్లు ప్రవాహ తాకిడికి లోనై నున్నగా, గుండ్రంగా తయారయ్యే విధంగానే జీవితంలో సంఘర్షణ మనిషిని తీర్చిదిద్దుతుంది.

**ప్రశ్నకర్త :** ఘర్షణ, సంఘర్షణ వీటి భేదం ఏమిటి?

**దాదాశ్రీ :** వేటిలో జీవంలేదో అవి విభేదానికి గురైతే దానిని ఘర్షణ అంటారు. వేటిలో జీవమున్నదో అవి విభేదానికి గురైతే దానిని సంఘర్షణ అంటారు.

**ప్రశ్నకర్త :** సంఘర్షణ వల్ల ఆత్మశక్తి కుంటుపడ్తుందా?

**దాదాశ్రీ :** నిజమే. సంఘర్షణ పడాలి అనే భావమే మనలో ఉండకూడదు.

## ఘర్షణకు కారణం ప్రకృతి

**ప్రశ్నకర్త :** ఘర్షణకు కారణం జడమా లేక చేతనమా?

**దాదాశ్రీ :** మీ పూర్వజన్మలోని ఘర్షణలే మరల ఘర్షణను సృష్టిస్తాయి. ఇందులో జడమా లేక చేతనమా అన్న ప్రశ్నే లేదు. ఆత్మకు దీనితో ఎటువంటి సబంధమూ లేదు. ఈ దేహమే (కాంప్లెక్స్ ఆఫ్ థాట్స్, స్పీచ్ అండ్ యాక్షన్) ఈ ఘర్షణలకు కారణం. కాని పూర్వజన్మలోని ఘర్షణలే యిపుడు మరల

విభేదాలను కల్గిస్తాయి. ఎవరికైతే పూర్వపు ఘర్షణ పూర్తి అయిపోయిందో అంటే పెండింగ్‌లేదో వారికి ఘర్షణలుండవు. అనగా ఒక ఘర్షణ మరొక ఘర్షణకు అది ఇంకొక ఘర్షణకు కారణమౌతుంది.

శరీరం పూర్తిగా జడం కాదు, ఇది మిశ్రచేతనం. ఆత్మయొక్క విశేషాంశము మరియు జడము యొక్క విశేషాంశము రెండూ కల్సి మూడవరూపం, ప్రకృతి స్వరూపం, ఏర్పడింది. ఇదే అన్ని ఘర్షణలను సృష్టిస్తుంది.

**ప్రశ్నకర్త :** ఎక్కడైతే ఘర్షణ ఉండదో అక్కడ ఉన్నతమైన అహింసా భావము ఉన్నట్లా?

**దాదాశ్రీ :** కాదు. అలాంటిదేమీ లేదు. ఇపుడు మీరు గోడకు ఢీకొంటే ఎంత ప్రమాదమో గుర్తించారు. సర్వజీవులలో విరాజమానుడైన పరమాత్మతో ఢీకొంటే ఇంకెంత ప్రమాదమో తెల్సుకొన్నారు. ఈ జాగృతి కారణంగా మీలో పరివర్తన చోటు చేసుకొంటుంది.

అహింసను పూర్తిగా, దాని పూర్ణ స్వరూపంలో, అర్ధం చేసికోవటం చాలా కఠినము. అందువల్ల 'ఎప్పుడూ ఘర్షణకు తావివ్వకూడదు' అని మీరు గ్రహిస్తే మీ శక్తులు పరిరక్షింపబడటమే కాక దినదినాభివృద్ధి చెందుతాయి. అపుడు ఘర్షణ కారణంగా జరిగే నష్టం ఏమీ ఉండదు. ఒకవేళ ఎపుడైనా ఘర్షణ జరిగితే ప్రతిక్రమణ చేయటం ద్వారా (హృదయ పూర్వకంగా క్షమాపణ అడగటం వల్ల) ఘర్షణ వల్ల కలిగే పరిణామాల నుంచి తప్పుకోవచ్చు. లేని పక్షంలో పరిణామాలు చాలా భయంకరంగా వుంటాయి. ఈ జ్ఞానం వల్ల మీరు ముక్తిని పొందగలరు. కాని ఘర్షణలు చోటుచేసుకుంటే ఆ మార్గంలో మీకు చాలా అవరోధాలు కల్గి, ముక్తిని పొందటం చాలా ఆలస్యం అవుతుంది.

ఒక గోడను గురించి వ్యతిరేక భావనలు (నెగెటివ్ థింకింగ్) కల్గటం వల్ల అది మీకు హానిచేయదు ఎందువల్లనంటే ఆ నష్టం ఏకపక్షం కనుక. కానీ ఒక జీవిత వ్యక్తి గురించి ఒకే ఒక్క వ్యతిరేకభావన (నెగెటివ్ థాట్) కలిగితే అది విపరీతమైన హానిని కల్గచేస్తుంది. ఆ నష్టం రెండు వైపుల నుంచి వుంటుంది. కానీ మీరు ప్రతిక్రమణ చేయటం వల్ల మన దోషం చెరిపివేయబడ్తుంది.

అందువల్ల ఎక్కడెక్కడ ఘర్షణ జరిగితే అక్కడ అనగా వెంటనే ప్రతిక్రమణ చేయటం ద్వారా ఘర్షణ ముగిసిపోతుంది.

## సమ్యక్ జ్ఞానం ద్వారానే పరిష్కారం

**ప్రశ్నకర్త :** దాదా! అహంకారం వల్ల ఇంటి వద్ద, ఆఫీసులోను, దాదాజీ యొక్క పనిచేసేటపుడు కూడా విభేదాలు తలెత్తుతుంటాయి. వాటి గురించి మీరు ఏమి చెప్తారు? వాటినన్నింటిని కూడ పరిష్కరించుకోవలసిన అవసరం ఉంది కదా?

**దాదాశ్రీ :** అవును, పరిష్కారం అవసరమే. నా వద్ద ఈ జ్ఞానాన్ని పొందినవారు సమాధానాన్ని పొందగలరు. కాని జ్ఞానాన్ని పొందని వారి మాటేమిటి? వారు ఏ విధమైన పరిష్కారాన్ని పొందగలరు. వారు ఒకరితో ఒకరు విభేదిస్తారు. ఈ జ్ఞానాన్ని పొందినవారు అలా విభేదించరు.

**ప్రశ్నకర్త :** కానీ దాదాజీ! ఎవరూ ఘర్షణ పడకూడదు కదా!

**దాదాశ్రీ :** ఘర్షణ స్వాభావికమైనది.. వారు అటువంటి ప్రారబ్ధాన్ని వెంటతెచ్చుకున్నారు కనుక ఘర్షణ జరుగుతుంది. అటువంటి ప్రారబ్ధాన్ని వెంట తెచ్చుకోకపోతే ఆ విధంగా జరగదు. ఆ వ్యక్తి స్వభావం అంతే అని గ్రహించి దానివల్ల మీరు ప్రభావితులు కాకుండా ఉండాలి. పూర్వ సంచితమైన సంస్కారాలు ఆ స్వభావాన్ని వ్యక్తం చేస్తాయి. మనం నిజస్వరూపంలో (శుద్ధాత్మగా) ఉండాలి. ఈ జ్ఞానంవల్ల అన్ని పరిస్థితులు అవే సమసిపోతాయి. కానీ మీరు ఆ పరిస్థితుల ప్రభావానికి లోనైతే ఘర్షణ కొనసాగుతుంది. ఘర్షణ ఎపుడోఒకపుడు తప్పక జరుగుతుంది. భార్యాభర్తల మధ్యకూడ జరుగుతుంది. అయినా వారు సహజీవనం సాగించటం లేదా? ఘర్షణ ఒకరినుంచి మరొకరిని వేరుచేయకుండా ఉండేలా జాగ్రత్త పడాలి.

**ప్రశ్నకర్త :** దాదాజీ! వివాదాలకు దూరంగా ఉండాలని నిరంతరం భావించాలి కదా!

**దాదాజీ :** అవును ఆ భావన వుండాలి. మీరు చేయవలసినది అదే. అయినప్పటికీ ఘర్షణ జరిగితే దానికి మీరు ప్రతిక్రమణ చేయాలి. ఆ వ్యక్తితో ఎప్పటిలా స్నేహపూర్వకంగా మెలగాలి. ఎన్నిసార్లు ఘర్షణ జరిగితే అన్నిసార్లు ప్రతిక్రమణ చేయాలి. కర్మయొక్క పొరల కారణంగా ఘర్షణ మరల మరల

సంభవిస్తుంది. ప్రతిక్రమణ చేసిన ప్రతీసారీ ఒక్కొక్కపొర విడిపోతుంది. నా విషయంలో ఎపుడు ఘర్షణ జరిగినా, దాని కారణంగా నేను మంచి జ్ఞానాన్ని పొందానని మనసులో నోట్ చేసికొంటాను. ఘర్షణ మీ జాగృతికి తోడ్పడుతుంది. ఘర్షణ ఆత్మకు విటమిన్ వంటిది (శక్తిదాయిని). ఘర్షణ వల్ల ఏ సమస్యాలేదు. కాని ఘర్షణ కారణంగా ఒకరి నుంచి మరొకరు వేరుపడటం జరుగకూడదు. ఈ విషయంలో జాగ్రత్త వహించాలి. ఇది ఆధ్యాత్మిక సాధనల సారం. ఇదే పురుషార్థం. ఎదుటి వ్యక్తిదే తప్పు అని మీరు భావించినా, లేక మీకు ఎదుటి వ్యక్తితో తీవ్రమైన అభిప్రాయభేదం ఏర్పడినా ప్రతిక్రమణ చేయటం ద్వారా ఆ విభేదానికి మంగళం పలకాలి.

నేను అందరితో ఏ విధంగా కల్సిపోతున్నాను? నీతో కూడ కలసి మెలసి వుంటున్నానా లేదా? మన మాటల (వాణి) కారణంగానే విభేదాలు ఏర్పడతాయన్నది వాస్తవమే. నేను ఎక్కువగానే మాట్లాడతాను. అయినా విభేదాలు ఏర్పడుతున్నాయా?

ఘర్షణ సంభవిస్తుంది. వంటపాత్రలు ఒకదానికొకటి తగిలినపుడు చప్పుడు వస్తుంది. ఘర్షణను సృష్టించటం దేహలక్షణం, అది అటువంటి ప్రారబ్ధాన్ని వెంటతెచ్చుకొన్నపుడు మాత్రమే. ఈ జ్ఞాన ప్రాప్తికి ముందు ఘర్షణలు నాకు కూడ అనుభవమే. కాని ఈ జ్ఞానం లభించిన తర్వాత ఎటువంటి ఘర్షణ జరగలేదు. ఎందువల్లనంటే ఈ జ్ఞానం అనుభవజన్యమైనది. ఈ జ్ఞానం వల్ల నా పూర్వపు ఖాతాలను అన్నింటినీ నేను సెటిల్ చేసికొన్నాను. మీరింకా మీ ఖాతాలను సెటిల్ చేసికోవలసి వుంది.

## ప్రతిక్రమణ ద్వారా మీ దోషాలను కడిగివేసుకోండి.

జ్ఞానప్రాప్తి తర్వాత ప్రతిరోజూ ఐదువందల దోషాలు మీవి మీకు కన్పించటం మొదలైతే మీరు మోక్షానికి చాలా దగ్గరవుతున్నట్లు గుర్తించవచ్చు.

మీరు ఎక్కడ ఉన్నప్పటికీ విభేదాలకు దూరంగా వుండండి. ఘర్షణలకు లోనైతే ఈ జన్మను పాడుచేసికోవటమే కాక భవిష్య జన్మను కూడ నాశనం చేసికొన్నవారవుతారు. ఈ జన్మను ఎవరైతే నాశనం చేసికొంటారో వారు ఖచ్చితంగా భవిష్య జన్మను కూడ నాశనం చేసికొన్నట్లే. ఈ జన్మలో ఎటువంటి వివాదాలు/

సమస్యలూ లేకుండా జీవించగల్గితే వచ్చే జన్మలో ఎటువంటి సమస్యలూ మనకు రావని తెల్సుకోవచ్చు. ఇపుడు మనం సమస్యలను సృష్టించుకొన్నట్లయితే అవి వచ్చేజన్మలో కూడా మన వెంట వస్తాయి.

## మూడు జన్మలకు గ్యారంటీ

ఎవరైతే ఎవరితోనూ విభేదించకుండా వుంటారో వారు మూడుజన్మలలో ముక్తిని పొందుతారని నేను గ్యారంటీ యిస్తాను. మీరు విభేదిస్తే ప్రతిక్రమణ చేయవలసి వుంటుంది. సంఘర్షణ శారీరక స్వభావం. దేహాల మధ్య సంభవించే సంఘర్షణ ప్రతిక్రమణ ద్వారా వినాశమౌతుంది.

ఎదుటివ్యక్తి గుణిస్తే, అపుడు మనం భాగించాలి. అందువల్ల శేషం ఏమీ మిగలదు. ఎదుటివ్యక్తి గురించి వ్యతిరేక భావనలు కల్గివుండటం (ఆ వ్యక్తి నన్ను అలా అన్నాడు, ఇలా అన్నాడు అని తలంచటం) అన్నింటిలోకి పెద్ద తప్పు. దారిలో వెళ్తూ చెట్టుకు గుద్దుకొంటే, మీరు దానితో ఎందుకు పోట్లాడరు? చెట్టును జడవస్తువుగా చూస్తున్నారు కనుక దానితో పోట్లాడరు. ఎవరైతే ఘర్షణకు దిగుతారో వారంతా చెట్టుతోనే సమానం. ఆవుపాదం మీకాలి వ్రేళ్లమీద పడిందనుకోండి. అపుడు దానిని మీరేమైనా అంటారా? అలాగే మనుష్యులతో కూడ ప్రవర్తించాలి. జ్ఞాని పురుషులు ఏ విధంగా అందరిని క్షమిస్తున్నారు? అజ్ఞానం వల్ల వారు గ్రహించటం లేదని, వారూ చెట్టులాంటి వాళ్ళేనని జ్ఞానికి తెలుసు. ఎవరైతే అర్థం చేసికోగలరో వారికి చెప్పవలసిన అవసరం లేదు. వారు వెంటనే గ్రహించి లోపలే ప్రతిక్రమణ చేస్తారు.

## ఎక్కడ ఆసక్తి వుంటుందో అక్కడ రియాక్షన్ వుంటుంది.

**ప్రశ్నకర్త :** చాలా సందర్భాలలో ఎవరినీ ద్వేషించాలన్న కోరికలేకపోయినప్పటికీ ద్వేషించటం జరుగుతుంది. దీనికి గల కారణం ఏమిటి?

**దాదాశ్రీ :** ఎవరితో అలా జరుగుతుంది?

**ప్రశ్నకర్త :** ఒక్కొక్కసారి నా జీవిత భాగస్వామితోనే జరుగుతుంది.

**దాదాశ్రీ :** అది ద్వేషం కాదు. ఆకర్షణ నుంచి ఏర్పడే ప్రేమ సదా రియాక్షన్‌తో కూడి వుంటుంది. అందువల్ల అతను చికాకుపడటం, ఆమె మూతి

ముడుచుకొని అతని నుంచి దూరంగా ఉండటం జరుగుతుంది. ఆ ఎడబాటు కొద్దిసేపు మాత్రమే వుంటుంది. ఆ తర్వాత ఇద్దరూ ఒకరినొకరు ఇష్టపడతారు. వారి మధ్యగల ప్రేమ కారణంగా ఒకరి విషయంలో మరొకరు జోక్యం చేసికొంటూ, విభేదిస్తూ మరల కలసిపోతూ వుంటారు. ఇది పునరావృత్తమౌతూనే వుంటుంది. ఎక్కడ ప్రేమ అధికంగా ఉంటుందో అక్కడ ఇంటర్‌ఫిరెన్స్ వుంటుంది. ఇంటర్‌ఫిరెన్స్ ఎక్కడ చోటుచేసి కొంటుందో వారి అంతరంగంలో ప్రేమభావం వుంటుంది. ఒక వ్యక్తికి పూర్వజన్మ బంధం కారణంగా ఏర్పడే ఈ అధికప్రేమ ఇంటర్‌ఫిరెన్స్‌కి (జోక్యం చేసుకోవటాన్కి) కారణమౌతుంది. అధిక ప్రేమ లేకుంటే జోక్యం చేసికొనే అవసరమే లేదు. ఇంటర్ ఫిరెన్స్ యొక్క లక్షణం అధిక ప్రేమ.

విభేదాల కారణంగానే తమ ప్రేమ బలపడ్తుందని ప్రజలు తలుస్తారు. అది నిజమే. మీరు దేనినైతే ప్రేమ అని చెప్తున్నారో అది విభేదాల నుంచి ఏర్పడే ఆకర్షణ మాత్రమే. ఈ విధమైన ఆకర్షణ సదా తిరస్కారానికి గురి కావలసి వస్తుంది. ఎక్కడ విభేదాలు తక్కువగా ఉంటాయో అక్కడ ఆకర్షణ తక్కువ వుంటుంది. ఒక కుటుంబంలో భార్యాభర్తల మధ్య పోట్లాటలు తక్కువగా ఉ న్నాయంటే వారి మధ్య ఆకర్షణ కూడ పరిమితంగా ఉందని మనం అర్ధం చేసికోవచ్చు. ఇది నీకు అర్ధమయిందా?

**ప్రశ్నకర్త :** సంసార వ్యవహారాలలో అహంకార కారణంగా వాదోపవాదాలు, ఘర్షణలు జరుగుతుంటాయి.

**దాదాశ్రీ :** ఆ ఘర్షణలు అహంకార జన్యమైనవి కావు. అవి అహంకార కారణంగా తలెత్తినట్లు కన్పించినప్పటికీ అవి విషయవికార సంబంధమైనవి. విషయం లేకపోతే ఘర్షణ ఉండదు. విషయ సమాప్తి అయితే ఘర్షణ చరిత్ర కూడ సమాప్తమౌతుంది. ఒక సంవత్సరంపాటు బ్రహ్మచర్య వ్రతాన్ని పాటించిన దంపతుల్ని ఆ కాలంలో వారి జీవితం ఎలా గడిచిందని నేను అడిగినపుడు యుద్ధాలు, ఘర్షణలు, విభేదాలు ఏమీ లేకుండా అంతా శాంతిగా ఉందని చెప్పేవారు.

**ప్రశ్నకర్త :** ఇంటి పనులకు సంబంధించి ఘర్షణలు జరుగుతాయని

ఇంతకుముందు భావించేవాడిని. ఇంటి పనులలో సహాయపడినప్పటికీ ఘర్షణలు కొనసాగుతూనే ఉండేవి.

**దాదాశ్రీ :** విషయ సంబంధం ఉన్నంత వరకు ఆ ఘర్షణలు కొనసాగుతూనే వుంటాయి. ఘర్షణలకు మూల కారణము విషయమే. విషయ వికారాలను జయించినవాడు అందరినీ జయిస్తాడు. అతను తనకు తెలిసిన వారినందరినీ ప్రభావితం చేస్తాడు.

## స్థూల రూపం నుండి అతిసూక్ష్మరూపం వరకు

**ప్రశ్నకర్త :** మీరు చెప్పిన సూత్రం "విభేదాలు మానండి" ఈ సూత్రాన్ని ఎవరు భక్తి పూర్వకంగా ఆచరిస్తే వారు చివరకు మోక్షాన్ని పొందుతారు. వీటిలో స్థూల, సూక్ష్మ, సూక్షతర విభేదాల అంతరాలను, వాటిని విడిచే విధానాలను చెప్పండి.

**దాదాశ్రీ :** విభేదాలను మానాలి అనే నిశ్చయాన్ని అమలుపరుస్తూ ఆ మార్గంలో పురోగమించే కొద్దీ అతని అంతరస్ఫూర్తి వృద్ధిపొందుతుంది. ఎవరినుంచీ అతను నేర్చుకోవలసిన పనిలేదు. అంతనంతట అతనే తెలుసుకోగలడు. ఈ సూత్రం చివరకు వారిని మోక్షానికి చేరుస్తుంది. దాని శక్తి అంతగొప్పది. రెండవసూత్రం "బాధపడేవారిదే దోషం" ఇది కూడ మోక్షాన్ని ప్రసాదిస్తుంది. నేను చెప్పిన ప్రతి ఒక్కసూత్రం మోక్షాన్ని చేరుస్తుందని నేను గ్యారంటీ యిస్తున్నాను.

**ప్రశ్నకర్త :** మీరు స్తంభాన్ని గుద్దుకోవటం వంటి ఉదాహరణలు యిచ్చారు. అవి స్థూల ఘర్షణకు ఉదాహరణలు. సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమ ఘర్షణలకు ఉదాహరణ చెప్పండి. సూక్ష్మ ఘర్షణ అంటే ఏమిటి ?

**దాదాశ్రీ :** మీకు మీ తండ్రితో ఏర్పడే విభేదం సూక్ష్మ ఘర్షణ.

**ప్రశ్నకర్త :** సూక్ష్మం అంటే మానసికమా ? వాక్కు ద్వారా జరిగే ఘర్షణ కూడా సూక్ష్మమేనా ?

**దాదాశ్రీ :** అది స్థూల ఘర్షణ క్రింద వస్తుంది ఎందుకంటే అది అందరికీ తెలుస్తుంది ఎదుటివారికి తెలియనిది, కన్పించనిది సూక్ష్మ ఘర్షణ.

**ప్రశ్నకర్త :** సూక్ష్మ ఘర్షణను ఏ విధంగా తప్పించుకోవాలి ?

**దాదాశ్రీ :** ముందు స్థూలం, తర్వాత సూక్ష్మం, ఆ తరువాత సూక్ష్మతరం, చివరగా సూక్ష్మతమ ఘర్షణలను మానాలి.

**ప్రశ్నకర్త :** సూక్ష్మతర విభేదం అని దేనిని అంటారు ?

**దాదాశ్రీ :** మీరు ఒక వ్యక్తిని కొట్టారనుకోండి. అపుడు ఆ వ్యక్తి జ్ఞాన దృష్టితో "నేను శుద్ధాత్మను. నన్ను కొట్టేది వ్యవస్థితశక్తి (సైంటిఫిక్ సర్కమ్ స్టెన్షియల్ ఎవిడెన్స్)" అని ఈ విధంగా గ్రహించినప్పటికీ, మనసులో అతను కించిత్ మాత్రమైనా నీలో దోషాన్ని చూస్తే అది సూక్ష్మతర విభేదము.

**ప్రశ్నకర్త :** ఇంకొకసారి చెప్పండి, సరిగా అర్థం కాలేదు.

**దాదాశ్రీ :** నీవు యితరులలో చూసే దోషాలన్నీ సూక్ష్మతర విభేదాలు.

**ప్రశ్నకర్త :** అంటే ఇతరుల దోషాన్ని చూడటం సూక్ష్మతర ఘర్షణా?

**దాదాశ్రీ :** అదికాదు. ఒకసారి నీవు ఇతరుల దోషం ఏమీలేదు అని (జ్ఞానదృష్టిలో) స్థిరపర్చుకొన్న తర్వాత కూడా ఇతరులకు ఆ దోషాన్ని ఆపాదించి నట్లైతే అది సూక్ష్మతర విభేదం, ఎందువల్లనంటే ఎదుటివ్యక్తి శుద్ధాత్మ, దోషానికి అతను అతీతుడు.

**ప్రశ్నకర్త :** అది మానసిక ఘర్షణ కాదా ?

**దాదాశ్రీ :** మానసికమైనది అంతా సూక్ష్మ ఘర్షణ క్రిందకు వస్తుంది ?

**ప్రశ్నకర్త :** సూక్ష్మ మరియు సూక్ష్మతర ఘర్షణల మధ్య భేదం ఏమిటి?

**దాదాశ్రీ :** సూక్ష్మతర ఘర్షణ మానసిక పరిధిని దాటి ఉంటుంది

**ప్రశ్నకర్త :** సూక్ష్మతర ఘర్షణ ఉన్నప్పుడు సూక్ష్మఘర్షణ కూడా దానితో ఉంటుందనే అర్థమా ?

**దాదాశ్రీ :** అది కాదు తెల్సుకోవలసింది. సూక్ష్మ ఘర్షణ వేరు, సూక్ష్మతర ఘర్షణ వేరు అని తెల్సుకోవాలి. అన్నింటికంటె ఆఖరుది సూక్ష్మతమ ఘర్షణ.

**ప్రశ్నకర్త :** ఒకసారి సత్సంగంలో మీరు "చందూలాల్ (దేహం యొక్క పేరు)తో తాదాత్మ్యం చెందటం సూక్ష్మతమ ఘర్షణ" అని చెప్పారు.

**దాదాశ్రీ :** అవును. అది సూక్ష్మతమమే. దానిని వదలిపెట్టాలి. పొరపాటున తాదాత్మ్యం చెందితే తర్వాత పొరపాటు జరిగిందని మీరు గుర్తిస్తారు అవునా ?

**ప్రశ్నకర్త :** ఈ విభేదాలను తొలగించుకోవడానికి ఉపాయం కేవలం ప్రతిక్రమణ మాత్రమేనా ? ఇంకా వేరేమైనా ఉన్నదా ?

**దాదాశ్రీ :** ఇంకా వేరే ఏ సాధనమూ లేదు. నేను మీకు యిచ్చిన నవకల్మ్, ప్రతిక్రమణ ఒక్కటే. వేరే రెండవ సాధనం లేదు. ఈ ప్రపంచంలో ప్రతిక్రమణ మినహా వేరే ఏ సాధనమూ లేదు. అత్యున్నతమైన సాధనం ప్రతిక్రమణ. ఎందువల్లనంటే సంసారం అతిక్రమణ వల్లనే ఏర్పడుతుంది.

**ప్రశ్నకర్త :** ఇది ఎంత విస్మయకరం ! "ఏమి జరిగితే అదే న్యాయం", "బాధపడేవారిదే తప్పు" ఇత్యాది సూత్రాలు ప్రతి ఒక్కటీ అద్భుత సూత్రమే. దాదాజీ సాక్షిగా మనం ప్రతిక్రమణ చేస్తే ఆ స్పందన ఆ వ్యక్తిని చేరుతుంది.

**దాదాశ్రీ :** అది నిజం. ఆ స్పందన వెంటనే ఆ వ్యక్తిని చేరి ఫలితాన్నిస్తాయి. ప్రతిక్రమణ అవతలివ్యక్తిని ప్రభావితం చేసినట్లు మనకు అంత:కరణలో తెలుస్తుంది.

**ప్రశ్నకర్త :** కానీ దాదా, ప్రతిక్రమణ వెనువెంటనే, తత్క్షణమే జరుగుతుంది. ఇది దాదా యొక్క అద్భుతం. దాదాజీ యొక్క కృప అద్భుతం.

**దాదాశ్రీ :** అవును ఆశ్చర్యకరమే. ఇది వైజ్ఞానిక విషయం.

**జయ సచ్చిదానంద్**

## English Books of Akram Vignan of Dada Bhagwan

1. Adjust Everywhere **(English & Telugu)**
2. Ahimsa : Non-Violence
3. Anger
4. Aptavani - 1
5. Aptavani - 2
6. Aptavani - 4
7. Aptavani - 5
8. Aptavani - 6
9. Aptavani - 8
10. Aptavani - 9
11. Autobiography of Gnani Purush A.M.Patel
12. Avoid Clashes **(English & Telugu)**
13. Brahmacharya : Celibacy Attained With Understanding
14. Death : Before, During & After...
15. Flawless Vision
16. Generation Gap
17. Harmony In Marriage
18. Life Without Conflict
19. Money
20. Noble Use of Money
21. Pratikraman : The master key that resolves all conflicts
22. Pure Love
23. Right Understanding to Help Others
24. Science of Karma
25. Science of Speech
26. Shree Simandhar Swami : The Living God
27. The Essence Of All Religion
28. The Fault Is Of the Sufferer **(English & Telugu)**
29. The Guru and The Disciple
30. Tri Mantra : The mantra that removes all worldly obstacles
31. Whatever Happened is Justice **(English & Telugu)**
32. Who Am I ? **(English & Telugu)**
33. Worries

**'Dadavani' Magazine is published Every month**



## ఘర్షణలకు దూరంగా ఉండండి

రద్దీగా ఉన్న రోడ్డును దాటుతున్నపుడు యాక్సిడెంట్ జరగకుండా ఎంతో జాగ్రత్తగా వ్యవహరిస్తారు. నిత్య జీవితంలో కూడ ఇతరులతో వ్యవహరించేటపుడు అంతే అప్రమత్తతను పాటించాలి. అవతలి వ్యక్తి ఎంత క్రూరుడైనా, అతని ప్రవర్తన ఎంత ఏహ్యమైనదైనా ఎట్టి పరిస్థితులలోనూ ఎవరినీ గాయపర్చకూడదు అని నిశ్చయించుకోవాలి. మీరు ఎంతో జాగ్రత్తగా ఉన్నప్పటికీ అవతలి వ్యక్తి మీతో ఘర్షణపడి, మిమ్మల్ని గాయపరచవచ్చు. ప్రతివివాదంలోనూ యిరు పక్షాలవారికీ నష్టము కలుగుతుంది. మీరు ఎవరికైనా దుఃఖాన్ని కల్గిస్తే అదే క్షణంలో మీకూ వేదన కలుగకమానదు. ట్రాఫిక్ నియంత్రణకు సంబంధించిన ఉదాహరణ చెప్తాను. ఎదురుగా వస్తున్న ఏదైనా వాహనాన్ని మీరు ఢీకొంటే, ఆ యాక్సిడెంట్‌కి ఫలం మరణమే. అందువల్ల ఎవరితోనూ ఘర్షణకు దిగవద్దు.

– దాదాశ్రీ

ISBN 978-81-89933-21-0

9 788189 933210

Printed in India

dadabhagwan.org